# ఈ ఇల్లు అమ్మబడును

[ ఇతర నాటికలు ]

డి. వి. నరసరాజు

దేశి కవితామండలి
విజయవాడ - 2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
డిశెంబరు — 19౫౮
వెల: రూపాయి న్నర
దేశీ ప్రెస్, విజయవాడ-౨.



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ



ఇందులో:

ఈ ఇల్లు అమ్మబడును
ఆత్మ హత్య
స్వర్గ సీమ

## పాత్రలు :

ఇంటి యజమాని

భర్త

భార్య

విశాలాంధ్రుడు

సి. ఐ. డి.

నౌకరు

# ఈ యిల్లు అమ్మబడును

ఒక పెద్ద పాత మేడలో డ్రాయింగురూము. కట్టడం పాతపద్ధతిలో వుంటుంది. గదిలో పాతపేము సోఫాలు, కుర్చీలు వేసివుంటయ్. స్టేజీకి ఎడమప్రక్కకు కుడిప్రక్కకు వాకిళ్ళు వుంటయ్. సెంటర్‌లో గూడా వాకిలి వుంటుంది. కాని, ఆ వాకిలికి కర్టెన్ వేసి వుంచవచ్చు. ఆ వాకిలిగుండా రాకపోకలు ఏమీ వుండవు. స్టేజికి కుడివైపున ద్వారం బయటినుంచి లోనికి వచ్చేది, ఎడమవైపున ద్వారం యింటి లోపలికి పోయ్యేది.

ఎదురుగా గోడకు ఒకప్రక్కన ఒక స్త్రీ ఫోటో తగిలించి వుంటుంది. దానికి పూలదండ వేసి వుంటుంది. రెండో ప్రక్కన 'ఈ యిల్లు అమ్మ బడును' అని బోర్డు తగిలించి వుంటుంది.

తెర లేవగానే ఎడమవైపునుంచి-అంటే యింటిలోపలనుంచి ఇద్దరు వ్యక్తులు ప్రవేశిస్తారు. ఒక వ్యక్తికి దాదాపు 50 ఏళ్ళు వుంటయ్. అతనే ఈ యింటి యజమాని. అతని వెనక వ్యక్తికి పాతిక, ముప్ఫయి యేళ్ళుంటాయి. వాడు అతని నౌకరు.

యిద్దరూ చాలా నిరుత్సాహంగా వుంటారు. యజమాని వస్తూనే గోడకు తగిలించిన బోర్డు చూచి.........

యజ : సుబ్బన్నా !

సుబ్బ: బాబు !

యజ : బోర్డు లోపలగూడ తగిలించావెందుకురా ! (అని నిట్టూర్చి సోఫాలో కూర్చుంటాడు)

సుబ్బ: యిదియ్యాల మళ్ళీ ఒక డజను బోర్డులు రాసి యింటి చుట్టూ తగిలించాను బాబు ! ఒకటి మిగిలిపోతే–

మనం చూచుకోడానికుంటాదని – లోపలగూడ తగిలించాను.

యజ : ఎన్ని బోర్డులు తగిలించినా – ఈ యిల్లు అమ్ముడు బొయ్యేటట్టు లేదు. నెలరోజుల్నుంచీ కాచుకూచుంటే–వచ్చి చూచి పొయ్యేవాళ్ళేగాని – కనీసం 'ఖరీదు ఎంత!' అని అడిగిన ముండాకొడుకు లేడాయె! యింకా యెన్నాళ్ళురా సుబ్బన్నా! ఈ శవజాగరణ!

సుబ్బ: అయినా యింత పాతకొంప ఎవల్లుకొంటారు బాబు! కొంత కంటికి ఆనేటట్టు – కూంత సున్నం కొట్టించమంటే మీరు నామాట యిన్నారుగాదు.

యజ : సరే – ఏడిసినట్టేవుంది నీ సలహా! 'మా ఆయనే బ్రతికివుంటే మంగలి వాణ్ణయినా పిలుచుకువచ్చేవారం' దిట—వెనకటికొక తలచెడ్డ తాయారమ్మ! సున్నం కొట్టించే తాహతేవుంటే – యిల్లమ్ముకునే ఖర్మమేమిరా! డబ్బు కట్టలేకనేగా, ఆ ఫోన్ గూడ తీసేయమని అర్జీ పెట్టాను.

సుబ్బ: అదీకాక యిది దెయ్యాలకొంపని వూరంతా పేరు మోగి పోయింది బాబండి. అసలే పాతకొంప! అందులో మనఅమ్మగారు (ఫోటో కేసి చూపుతూ) వురిబోసుకుని చచ్చినట్టు వూరందరికీ తెలుసు. పైగా అమ్మగారు దెయ్యమై రాత్రిపూట యింటిచుట్టూ తిరుగుతున్నట్లు చుట్టుపక్కలవాళ్లు చూస్తిరి. యిక

ఈ యిల్లు కొనవుంటే - మొదకాయమీద తలకాయ వున్నోడు ఎవడు కొంటాడు సెప్పండి?

యజ: (నెత్తిమీద బాదుకుంటూ విసుగ్గా) నన్నేం చావ మంటావురా సుబ్బన్నా! (ఫోటో కేసి తిరిగి) యీ ముండ బ్రతికి వున్నన్నాళ్ళూ బాధించింది చాలక చచ్చికూడా నన్నిట్లా సాధిస్తున్నది. ఎట్లాచావనురా- దీనితో?

సుబ్బ: (ఫోటో కేసి దీనంగా చూస్తూ) బ్రతికుంటే నయినా కాస్త బతిమాలుకుందును. చచ్చినామెతో ఎట్లా గంట చావటం?—

యజ: ఆ చచ్చినముండ నేరుగా స్వర్గానికో నరకానికో పోక, యింకా యీ ఇంటి దూలాలు పట్టుకుని వూగులాడుతూ, ఎందుకంట నన్నిట్లా ఏడిపించటం!

సుబ్బ: యిన్నేళ్ళు కాపురమున్న యిల్లు గదండి-ఇంటిమీద బమత చావక!......

యజ: అంత భ్రమత చావకపోతే-యీ ఇల్లు కాస్త అమ్మిన తరువాత-ఆ కొన్నవాణ్ణి పట్టుకుని - ఏడిపించి ఎర్రమన్ను చేయమను. కాదన్నానా? (ఒక్క క్షణం ఆలోచించి ఏదో నిర్ణయానికివచ్చి) ఒరే సుబ్బన్నా! యిలా నానుడు బేరంతో లాభంలేదుగాని- ఒక్కటే మాట! ఎల్లుండిదాకా చూస్తాను - ఎవడన్నా కొన్నాడా కొన్నాడు - లేకపోతే ఆవలి ఎల్లుండి ఒకటోతారీకున "పబ్లిక్ వేలం" అని నోటీసులు

పంచిపెట్టాను, అంతే! ఎంతవస్తే అంతే ప్రాప్త మనుకుంటాను.

సుబ్బ: నానూ అదే సెప్పుదా మనుకుంటున్నాను బాబు! ఎల్లుండితో ఇది అటోయిటో తేల్చుకుని పట్టుతారీఖు పట్నం ఎల్లిపోతున్నాను. మా బావ – మా అక్క మొగుడు సినిమాసీలో రోలం యిప్పిత్తానన్నాడు. ఎల్లిపోతున్నాను.

యజ: నీ మొఖం! నువ్వేం వేషం వేస్తావురా?

సుబ్బ: ఆఏసం యీ ఏసం ఏసేదాకా నాకేటి గాసారం బాబూ! – నాను నేబరోణ్ణి. నేబరు ఏసం ఏసేత్తాను బాబు! రోజుకి 5 రూపాయలు యిత్తారంట. ఇలా తమ బోటోరిముందు కూకుని ఎన్నాళ్లేడిత్తే తెల్లా రుద్ది నా బతుకు!

యజ: (దీనంగా) అయితే నువ్వూ దోవ చూచుకున్నావన్న మాట! – ఇక నే నొకణ్ణే మిగిలాను ఏకాకిగా___ (కాస్త ఆగి) ఒరే– యీ ఇల్లు అమ్ముడుబోతే – ఆ నాలుగురాళ్ళూ చేతిలో వేసుకుని నేనూ వస్తానురా సుబ్బన్నా!

సుబ్బ: ఓ! రండిబాబూ! మా బావతో సెప్పి మీకూ ఓ ఏసం ఇప్పిత్తాను—(అకస్మాత్తుగా ఏదో ఆలోచన తట్టి) ఆ! బాబూ మీరు వంటోడి యేసానికి మా పిట్టుగా చూటపుతారు బాబూ!___

యజ: ఛ! నోర్ముయ్! వెధవ!

బయట తలుపుకొట్టిన చప్పుడు - యిద్దరూ ఆగి వింటారు.
సుబ్బన్న గోడదగ్గరికి వెళ్ళి తొంగిచూచివచ్చి మెల్లగా చెపుతాడు

సుబ్బ: బాబూ! ఎవల్లో ఒక ఆడామె-ఒక మొగాయన! - మొగాయన సూటేసి హాటు పెట్టినాడు — ఆడామె కూడా టాపుటీపుగా "చినీమా టారు" నాగుంది బాబూ!

యజ: (ఆదుర్దాగా) ఎవరో యిల్లు చూడటానికే వచ్చి వుంటారు- ఉండు! ఉండు! నేనిక్కడే వుంటే వాళ్ళ కోసమే ఎదురు చూస్తున్నామని చులకనగా చూచి - అయినకాడికి అడుగుతారుగాని - నేను లోపలికెడతాను. నువ్వు వాళ్ళని యిక్కడ కూర్చోబెట్టి, మేడ మీద నేను పనిమీద వున్నానని చెప్పి - పిల్చుకు వస్తానని నాకోసం రా!... తెలిసిందా?—

సుబ్బ: ఓ! తెలిసింది బాబూ!

మళ్ళీ తలుపు చప్పుడు. యజమాని గబగబా లోపలికెడతాడు.
సుబ్బన్న బయటికి వెడతాడు. ఒక నిముషం తరవాత బయటినుంచీ
సుబ్బన్నా - ఒక భార్యా భర్తా వస్తారు. వాళ్ళిద్దరూ వస్తూనే
గోడలవంకా పై కప్పువంకా చూస్తూ వస్తారు...............

సుబ్బ: దయచెయ్యండి బాబు! యిలా కూకోండి - మా అయ్యగారు మేడమీద వున్నారు — పోయి సెపుతాను.

భర్త: పనిమీద వున్నారా? అయితే మళ్ళీ వస్తాంలే! (అని పోబోతుంటాడు)

సుబ్బ: (ఖంగారుగా) ఏనంటే అంత పెద్ద పనేంగాదు బాబు! సెప్పి యిప్పుడే తీసుకొత్తాను! తమరిట్టా కూకోండి. (భార్యా భర్తా యిద్దరూ సోఫాలో, కూర్చుంటారు. సుబ్బన్న లోనికి పోబోతుంటే...)

భర్త: యిదిగో! నీ పేరేమిటో?

సుబ్బ: నాపేరాండి! సుబ్బన్నండి!

భర్త: అయితే... (ఏదో చప్పుడవుతుంది. వులికిపడి మళ్ళీ సర్దుకుని మెల్లగా) మాకేం భయమటగానీ మాకు కాఫీ గీఫీ వద్దుసుమా!

సుబ్బ: చిత్తం! (అని వెళ్ళిపోతాడు)

భార్య: అదేమిటండీ - ముందుగానే వద్దంటారు. ఇంటికి వచ్చిన వాళ్ళకి కాఫీ యివ్వడం, అది మర్యాద! వద్దనకూడదు.

భర్త: సరేలే! నీ తెలివి తెల్లారినట్టేవుంది! యీ ఇంటి ముఖం చూస్తే వీడు కాఫీకూడా యిస్తాడనే ఆశ వుందీ?—వాడు ఎలాగూ యిచ్చేమొఖం కాదనే ముందుగా నేనే వద్దన్నాను.

భార్య: (యిల్లు ఎగా దిగా చూచి) ఫోనుకూడా వుంది. ఎవరో బాగా బ్రతికినవాడే. ఎందుకమ్ముతున్నాడో! ఇల్లు పాతదయినా - గదులు చాలా విశాలంగా వున్నాయండీ!

భర్త: అవును మరి! - దెయ్యాలు తిరిగే కొంప!! — ఆ మాత్రం విశాలంగా లేకపోతే ఎలా!...

భార్య: చాల్లెండి! ఎవరో గిట్టనివాళ్ళు అన్న మాటను పట్టుకొని! - దెయ్యాలు కాపురం వుంటాయా ఏమిటి?

భర్త: ఒకవేళ వున్నా - మీనాన్నలాంటి వాళ్ళను తెచ్చి నాలుగురోజు లుంచితే దెయ్యాలూ గియ్యాలూ మాయమై పోతయ్!

భార్య: చాల్లే వూరుకోండి!

పైనుంచి సున్నం పెళ్ళ ఒకటి రాలుతుంది.

భర్త: (ఉలిక్కిపడి లేచి) రామచంద్ర! రాఘవేంద్ర! (బిక్కమొహంతో) ఇదుగో మనం యీ ఇంట్లోంచి ఎంత త్వరగా బయటపడితే - మన పిల్లలు అంత అదృష్టవంతులు!

భార్య: పర్వాలేదు లే కూర్చోండి - కాస్త పాతకొంప — యింత మాత్రానికే కూలుతుందా ఏమిటి?

భర్త: నీకేం? నువ్వు పోయినా మీ నాన్నకి యింకా అరడజనుమంది వున్నారు. మా అమ్మకీ నాన్నకీ నే నొక్కణ్ణే! లే! లే!

భార్య: (కొంచెం కోపంతో) ఎందుకండీ ఈ సస - అసలు యీ ఇల్లు కొనడం యిష్టంలేదని చెప్పరాదూ! ఒక్క మాటతో పోతుంది.

భర్త: నే నామాట అచ్చ తెలుగులో, ఖచ్చితంగా ఎప్పుడో చెప్పాను.

భార్య: మరి అయితే ఇప్పుడెందుకు వచ్చినట్టు!

భర్త : చూడ్డానికి! అమ్మడానికి వచ్చిన ప్రతియిల్లూ చూడటం–ఆడవాళ్ళ ప్రాథమిక హక్కు! అది కాదనడానికి నేనెవణ్ని? అందులో పెట్టుబడిలేని పని! చూడు! విశ్రాంతిగా చూడు!

భార్య : అయితే కొనరన్నమాట!

భర్త : కొనకపోవడం నా జన్మహక్కు! అది కాదనడానికి నువ్వెవరవ్?

భార్య: అదికాదండీ! బ్యాంకిలో 25, 30 వేలు నిల్వ వుంచానని మీరేగా అన్నది?—

భర్త : ఉంచితే? – అందులో రాగికానీకూడా ఇప్పుడు తియ్యటానికి వీలులేదు. అది మన అమ్మాయికి కాబోయే మొగుడికి కట్నంకోసం రిజర్వుచేశాను.

భార్య: సరే! ఇంకేం? మిగతాడబ్బు మా నాన్ననడిగి కొంటాను – మీ కిచ్చిన కట్నం పదివేలు ఇలా పారెయ్యండి.

భర్త : కట్నం! ఇంకెక్కడుంది కట్నం? అప్పుడే అయిపోయింది. యిన్నేళ్ళంటే దాన్ని కట్నం యెందుకంటారు?— 'కట్నం' అంటే – 'వెంటనే ఖర్చుపెట్టవలసింది' అని అర్థం!

భార్య: ఆ పప్పులేం వుడకవ్! ఆ పదివేలూ నా కివ్వాల్సిందే!—

భర్త : (Calm గా సిగరెట్టు తీసి ముట్టిస్తూ) సరే! కాదు గూడదూ అంటే అలాగే ఇస్తాను. (Slight Pause)

రేపు అమావాస్యనాటికి రమ్మని మీ తమ్ముడికి కబురుచెయ్యి.

భార్య: ఎందుకూ?

భర్త: (Calm గా) ఇద్దరం కలిసి ఎక్కడన్నా కన్నం వేస్తాం.

భార్య: (కోపంగా) కన్నాలేసే జాతి మీది! మా ఇంటా వంటా లేదు!

భర్త: (Calm గా) లేదేం? అయితే మీతమ్ముడు జైలుకెందు కెళ్ళినట్టో?

భార్య: జైలుకా! జైలుకి! మీలాగ కాదు. దేశ స్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహం చేసి వెళ్ళాడు జైలుకి.

భర్త: కాయ్! కాయ్! అమ్మపుట్టిల్లు మేనమామ ఎరగడూ? 5 ఎకరాలమాగాణి పోతుందని ఆదుర్దాపడకు! గవర్నమెంటు వాళ్ళతో చెప్పనులే.

భార్య: (కోపంగా) చాల్లే వూరుకోండి–ఇక్కడికి వచ్చినా మీ వేళాకోళాలూ ఎత్తిపొడుపులూ మానారుగాదు! వచ్చినపని వదిలిపెట్టి ఏమిటీ వాగుడు?

భర్త: వచ్చినపని నీ చేతిలో వుంది. ఇల్లంతా తీరగ్గా తిరిగి చూచిరా. వెళ్ళిపోదాం. లేదు, ఇప్పుడే ఇలాగే వెళ్ళి పోదామంటావా, రెడీ!

భార్య: ఆయనకు కబురుకూడా చేసి, కనబడకుండా వెళ్ళిపోతే ఆయ నేమనుకుంటాడు?

భర్త: ఏమీ అనుకోడు. మనలాంటి వాళ్ళెంత మంది? వచ్చినవాడల్లా యిల్లు కొంటే ఆ బోర్డులు ఎందు కలా ఇన్నాళ్లు వేళ్ళాడుతుంటాయ్!

భార్య: (విసుగ్గా) సరే! పోదాం పదండి! (అని లేవ బోతుంటే లోపల్నుంచి యజమాని, సుబ్బన్న ప్రవేశం)

యజ: ఆఁ! ఆఁ! కూర్చోండి క్షమించాలి. కొంచెం ఆలస్యం అయింది కూర్చోండి!

భార్య: (తడబడుతూ) మీరు పనిమీద వున్నారేమోనని మళ్ళీ రావచ్చుగదా అని వెళ్ళబోతున్నాం! (కూర్చుంటుంది. భర్తకూడా ఇష్టం లేకపోయినా కూర్చుంటాడు.)

యజ: కాస్త కాఫీ ఏమయినా...

భర్త: (Cutting him) నా కక్కరలేదండి. మా ఆవిడ - వట్టి కాఫీ-తాగదు.

యజ: పోనీ టిఫిన్ కూడా...

భార్య: (భర్తతో) చాల్లే వూరుకోండి. (లేని చిరునవ్వుతో యజమానితో) ఆయన మాటలకేం లెండి. నాకూ అక్కర లేదు.

యజ: ఆఁ! మరి! యిల్లంతా ఒకసారి చూస్తారా?

భర్త: ఓ! నిరభ్యంతరంగా! అసలు వచ్చిందందుకేగా!

భార్య: చూస్తామనుకోండి! అసలు ఖరీదు వగయిరా విష యాలు కూడా తెలుసుకుంటే...

యజ : అయ్యో ! తమ మొఖాలు చూస్తుంటే - ఎందుకో నాకు మనస్సులో వున్న విషయం మాట్లాడెయ్య బుద్ధి పుడుతోంది... నిజం చెపుతున్నాను. అసలు యీ యిల్లు అమ్మటం నాకు సుతరామూ యిష్టం లేదండి.

భర్త : (తృప్తిగా నిట్టూర్చి) బ్రతికించారు! యిక లే పోదాం (అని లేస్తాడు)

యజ : అహాఁ హాఁ! కూర్చోండి. (అని చేతులు పట్టుకుంటాడు)

భార్య: ఏమిటండీ; ఆ తొందర ? పూర్తిగా చెప్పనివ్వండి !

భర్త : అమ్మడం యిష్టం లేదంటూంటే ఇంకా చెప్పేదేమిటి ?

యజ : మొదట్లో యిష్టం లేదనుకోండి. ఎందుకంటే, ఇది మా ముత్తాతలు కట్టిన ఇల్లు. చాలా స్ట్రాంగు అయినది.

భర్త : (ఆశ్చర్యంగా) స్ట్రాంగు ఇప్పుడా ? కట్టినప్పుడా ?

భార్య: (విసుగ్గా) అబ్బ !

యజ : (నవ్వుతూ) పంతులుగారు చాలా చతురులు !

భర్త : నాయుడుగారు, తమరుమటుకు తక్కువవారా ?

సుబ్బ: (కోపంగా) మా అయ్యగారు నాయుడు కాదండి !

భర్త : నేను పంతులుగారినా ఏమిటి ? (సుబ్బన్న ఏదో అనబోతే)

యజ : సుబ్బన్నా ! నువ్వూరుకోరా !

సుబ్బ: పండంటి మా పంతులుగారిని నాయుడు అంటే నే నూరుకుంటానా ?

భర్త : పదహారణాల నాయుణ్ని నన్ను 'పంతులు' అంటే నే నూరుకుంటానా ?

యజ : (గట్టిగా) సుబ్బన్నా ! (సుబ్బన్న తగ్గుతాడు) ఇదిగో ఇంటిప్లాను ఒకసారి చూస్తారా ? (అని కాగితాలు భార్యకు చూపుతూ వుంటాడు. భర్త లేచి సిగరెట్టు తీసి ప్రక్కనేవున్న సుబ్బన్న వేపు చూస్తాడు. సుబ్బన్న గ్రహించి చిరునవ్వుతో చెయ్యిచాచి, చాటుగా సిగరెట్ తీసుకుని జేబులో పెట్టు కుంటాడు)

భార్య: ఏమండీ ! ఇంటి ప్లాను చూశారా ?

భర్త : ప్లానేం ఖర్మం ! ఇల్లే చూడవచ్చుగా ! అయినా తెలుసుకుంటే మంచిదే ! ఇల్లు ఖరీదు ఎంత చెపు తున్నారు ?

యజ : ముప్ఫయ్ వేలండి !

భర్త : (ఆశ్చర్యంతో) ఆఁ ! 30 వేలా ? రూపాయలే !

యజ : అవునండి !

భర్త : (భార్యతో) సరే ! ఇక లే !

యజ : (ఆదుర్దాగా) ఆఁ ! ఆఁ ! తొందరపడకండి. నా ధర నేను చెప్పాననుకోండి ! మీరూ మరోమాట అడ గండి-తప్పేముంది ?

భర్త : ఎందుకులెండి! యీమాత్రం మర్యాదగా వెళ్ళడం మంచిది.

యజ : ఫరవాలేదు! అడగండి! (నిర్బంధిస్తాడు)

భర్త : అడగమంటారా ?

యజ : అడగండి!

భర్త : 3 వేలు!

యజ : (షాక్ తిని) మూడువేలా ? (దీనంగా) ఇల్లు, స్థలం, తోటా, దొడ్డీ అంతా మూడువేలా!

భర్త : ఏమండీ! నేను మూడు వేలంటేనే మీగుండె ఇంత టపటప కొట్టుకుందే-మీరు 30 వేలన్నప్పుడు నా గుండె గతి ఏంకావాలి చెప్పండి ?

భార్య: అదేమిటండీ, ఇది ఆయన ఇల్లు. అమ్మేకు నేవారు ఆయన! ఆయన ఇష్టం. ఎంతయినా చెప్పుకుంటాడు.

భర్త : కొనుక్కునే వాడిని నేను. నా ఇష్టం. ఎంతకయినా అడుగుతాను.

యజ : మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారు.

భర్త : పైగానా ? అడగమని మీరే అంటిరి - అడిగాను. ఆ ధరకి మిమ్మల్ని ఇవ్వమని ఏమైనా నిర్బంధించానా ?

యజ : మీరు కాబట్టి మరొకమాట చెబుతాను. 25 వేలు చేసుకోండి. అంతకు ఒక్క దమ్మిడీకూడా తగ్గడానికి వీలులేదు.

భర్త : 25 వేలు కాదుగదా ! నే నడిగినదానికి 25 దమ్మిడీలు గూడా ఎక్కువ ఇవ్వను.

యజ : మీరొకసారి ఇల్లంతా చూస్తే అట్లా మాట్లాడరండి- ఇల్లు చూద్దురుగాని—

భార్య : రండి, చూద్దాం ! (అని లేస్తుంది)

భర్త : చూచినా ఒకటే, చూడకపోయినా ఒకటే. మనది ఒకటే మాట. ఆడినమాట తప్పము. సత్య హరిశ్చంద్రుడి సవతి సోదరులం !

యజ : కానండి - కానకపొండి - ఇంతదాకా వచ్చారుగా, చూచి వెళ్ళండి.

భార్య : రండి ! పాపం ! ఆయన అంతగా చెపుతూవుంటే !

భర్త : నా కోపికలేదు. కావాలంటే నువ్వు చూచిరా. నేను ఇక్కడే కూర్చుంటాను.

భార్య : (విసుగ్గా యజమానితో) సరే! పదండి. (యజమాని, అతనివెంట భార్య, సుబ్బన్న లోపలికి వెడతారు)

భర్త : (కుర్చీ ముందుకు లాక్కుని కూర్చుంటూ, సిగరెట్ తీసి) పాతిక వేలుట ! ఆశకి అంతనేది వుండాలి. (సిగరెట్టు తీసి తీరిగ్గా కాల్చుకుంటూంటాడు)

బయటనుంచి ప్రవేశం. సుమారు 60 ఏళ్ళుంటాయి. ధోవతి లోపనికి చొక్కాచేసి, పైనకోటు, టై, తలపాగ, పైన కండువా, చేతిలో కర్ర, కళ్ళజోడు-వేషంతో వస్తూనే గట్టిగా మాట్లాడుతూ వస్తాడు.

ముసలాయన : అసలు తెలుగుజాతి లక్షణమే అంత ! అందుకే నే నెప్పుడో చెప్పాను - తెలుగువాడి వంటికి

వ్యాపారం సరిపడదు అని. ఆంధ్రరాష్ట్రం వస్తేనేం విశాలాంధ్రరాష్ట్రం వస్తేనేం! తెలుగువాడు తెలుగు వాడే! తెలివితక్కువవాడు! (భర్తవేపు తిరిగి) నువ్వు నిజంగా తెలివిగా ఇల్లు అమ్ముకోదల్చుకుంటే 'ఇల్లు అమ్మబడును' అన్న బోర్డుమీదే, దాని ఖరీదుకూడ తగలెయ్యకూడదూ? కొనదల్చుకున్న నాబోటివాడు ఆ చెక్కకాస్త మొఖాన పారేసి, క్రయం రాయించుకొనేవాడుగా!

భర్త : (ప్రక్కకు తిరిగి) వీడెవడో నేనే ఇంటి యజమాని ననుకుంటున్నాడు—కానియ్! కాసేపు వీడి మోజే తీరుద్దాం!

ముస : ఏమయ్యా? కష్టపడి తెలుగువాళ్ళు రాష్ట్రమయితే తెచ్చుకున్నారుగాని, తెలివితేటలు ఎక్కణ్ణుంచి తెచ్చుకుంటారు?

భర్త : 'తెలుగువాళ్ళు తెలుగువాళ్ళు' అని తెగ తెగనాడుతున్నారు—తమరు—

ముస : నేనా? తెలుగు గడ్డనే అంటిపెట్టుకున్న ఒట్టి తెలుగు వాణ్నే అయితే నీలాగే వుండేవాణ్ని! నేను మొదట ప్రవాసాంధ్రుణ్ణి! ప్రస్తుతం విశాలాంధ్రుణ్ణి!

భర్త : ఇంకా విశాలాంధ్ర రాలేదుగదండి.

ముస : (విసుగు-ఈసడింపుగా) అదిగో- తెలుగుబుద్ధి! — వచ్చిందాకా ఆగుతామటయ్యా - విశాలాంధ్ర

వచ్చిందనుకుని ముందుగానే అన్నీ యేర్పాట్లు చేసు కుంటే - తర్వాత రాకేం చస్తుందా? చచ్చినట్లు అదేవస్తుంది! ఆ యేర్పాట్లు చేయడానికే ఇన్నాళ్లో ఎక్కడ తిరిగినా సమయానికి స్వరాష్ట్రంలో కాలు పెట్టాను.

భర్త : (ముసలాడి అతివాగుడుచూచి కోపం వస్తుంది. కాని వీడికి Long Rope ఇవ్వాలని నిశ్చయించుకుని వినయం అభినయిస్తూ) పూర్తిగా తెలుగువాణ్ని— బుర్ర తక్కువ-తమ స్వీయచరిత్ర అంత సులువుగా బోధపడ్డంలేదు. కొంచెం లఘుటీక, టిప్పణం తగి లించి వివరిస్తే... ...

విశా : లఘుటీక టిప్పణం ఏంఖర్మం! దీర్ఘ టీకా తాత్పర్య సహితంగానే చెబుతాను. నేను పుట్టింది తెలుగు గడ్డమీదే! తల్లిదండ్రులుకూడా తెలుగువాళ్ళే! ఆరోయేటనే వుమ్మడి రాష్ట్రం విడిచి పరాయి రాష్ట్రాలమీద పడ్డాను. వయసుకు మించిన ఘన కార్యాలెన్నో చేశాను! ఆ వివరాలన్నీ అప్రస్తుతం. అటు తిరిగి, ఇటుతిరిగి - అయిదేళ్ళక్రితం మద్రాసు చేరాను. పంచవర్ష ప్రణాళిక వేసి ఒకే ఒక్క సినిమాచిత్రం తీశాను. మహమ్మారిలాగ, పట్టిన పట్టు విడవకుండా - పాతిక కేంద్రాలలో శతదినోత్స వాలూ, రజతోత్సవాలూ జరిపించాను. పదిహేను లక్షలు పాకెట్టులో వేసుకుని - నిన్ననే ఈ వూళ్ళో

దిగాను — అన్నట్లు ఆవేశంలో అడగటం మరిచాను- నువ్వు చూడలా మా సినిమా ?

భర్త : సినిమా పేరు ?

విశా : 'కదిలావా ఖబడ్దార్'

భర్త : లేదండి ! నేను సినిమాలు చూడను.

విశా : ఏం, పాపం !

భర్త : క్షమించండి. నాకు సినిమాలంటే చెడ్డ అసహ్యం. గడచిన 10 యేళ్ళకుగాను ఒకటో రెండో చూచాను.

విశా : అదుగో! కనబడుతూనేవుంది తెలుగువాడి Typical తెలుగు ! - అసలు, సినిమా చూడకుండా సినిమాలు అసహ్యించుకోడానికి నీకేం హక్కుంది ? - ఇదిగో అబ్బాయ్ ! అనవసరంగా వాదం అనవసరం ! ఒకే మాట చెబుతున్నాను. నువ్వు సినిమాలను గురించి మాట్లాడకు !

భర్త : సినిమా చూస్తే...

విశా : (Curt గా) 'ఆ పేరు ఎత్తొద్దు' అన్నాను అంతే ! అసలు నువ్వెవడివంట సినిమాల వూసెత్తడానికి ? (వేలిమీద Points లెక్కబెడుతూ) నువ్వు సినిమా చూడవ్ ! సినిమాకు పావలా డబ్బు లివ్వవ్ ! నీ కూతుళ్ళనీ, నీ కొడుకుల్నీ సినిమాలకు నీ చేతుల మీదుగా డబ్బులిచ్చి పంపవ్ ! చాటుగా రెండో సినిమాకి వెడితే చచ్చినట్టు పడుంటావ్ ! అటువంటి నువ్వు - సినిమాలను అసహ్యించుకుంటావ్ ? వుండు-

అట్లాగే చూస్తూవుండు. హైకోర్టులో Writ పడెయ్యబోతున్నాను.

భర్త: క్షమించండి, ఏదో తెలీక అన్నాను.

విశా: (Cool గా, తాపీగా) నువ్వంటే-నువ్వే కాదయ్యా! నే నిప్పుడు పెట్టిన చీవాట్లన్నీ నిన్నే ననుకుంటున్నావా? నీబోటివాళ్ళు దేశంలో చాలామంది వున్నారు. వాళ్ళందరికీ బుద్ధి రావాలని నీతో చెబుతున్నాను. నాకు కొంచెం ఉద్రేకం ఎక్కువ – భయపడకు!

భర్త: (నిట్టూర్చి) తమరు అలా నిలబడే వున్నారు – కూర్చోండి.

విశా: అదిగో! మరొక తెలుగు తెగులు! వచ్చినవాణ్ణి కూర్చోటం ఎరగనూ! నువ్వు రమ్మంటే వచ్చానా; నువ్వు కూర్చోమంటే కూర్చోడానికి! నాకు కాళ్ళు ఎప్పుడు నొచ్చితే అప్పుడే కూర్చుంటాను. (భుజం తడుతూ) తమ్ముడూ!

(చాలా Earnestగా)

మనకి చిన్న రాష్ట్రం వచ్చింది. పెద్ద రాష్ట్రం రాబోతోంది. నీ పద్ధతులు మార్చుకోవాలి. బుద్ధి వికసింపచేసుకోవాలి—నీకో చిన్న సలహా! స్వానుభవంమీద చెబుతున్నాను – స్వరాష్ట్రం వదలి కొన్నాళ్ళపాటు పరాయి రాష్ట్రాలలో పర్యటిస్తేగాని తెలుగువాడిబుద్ధి వికసించదనుకో! అందుకు ప్రత్యక్ష

నిదర్శనం ! - (అని తనను చూపుకుని పోయికూర్చుం టాడు; చుట్టతీసి వెలిగిస్తాడు.)

భర్త : (పక్కకువెళ్ళి మెల్లగా) అవును కనబడుతూనే వుంది నీ బుద్ధి వికాసం !—ఇల్లు చూడ్డానికి వచ్చినవాణ్ని- నన్ను యింటి యజమానినిచేసి ముక్కచీవాట్లు పెడుతున్నావ్ !

విశా : ఏమిటో—అంటున్నావ్ తమ్ముడూ !- అనేదేమిటో కొంచెం గట్టిగా అను—నాకు కొంచెం చెముడు.

భర్త : అది సహజమేలెండి. బుద్ధి అదేపనిగా వికసిస్తే చెవులు మూసుకుపోతయ్ !

విశా : (కళ్ళజోడుతీసి తుడుస్తూ) కళ్ళు కూడా బాగా కన బడవు !

భర్త : అదీ రోగలక్షణమే. అనుకోకుండా—అకస్మాత్తుగా డబ్బు వచ్చిపడితే కళ్లు కనబడవ్ ! (పళ్లు బిగపట్టి కోపంగా చూస్తూ.)

విశా : ఆఁ! అసలు విషయానికి వద్దాం. ఇల్లు ఎంతన్నావ్! (అని తోలుసంచిలో కాగితాలు తీస్తుంటాడు.)

భర్త : (సైడ్) వీడు మంచి మైకంలో వున్నాడు. కానియ్! ఏమయితే అది అవుతుంది. నాటకం పొడిగిస్తాను.

సుబ్బన్న లోపల్నుంచి వస్తాడు. 'బాబూ' అని ఏవో చెప్పబోతాడు.

భర్త : ఒరే సుబ్బన్నా (ఏదో చెప్పబోయి, ఆగి, ముస లాయనతో) మీకు మంచినీళ్ళేమైనా కావాలా?

విశా : అధిక ప్రసంగం! అదే కట్టిపెట్టమన్నాను. మంచి నీళ్లు కావలిస్తే నేనడగనూ? నాకేం భయమా? నాకు నోరు లేదూ? ఇటువంటి తెలుగు ప్రశ్నలతో నన్ను చీకాకు పెట్టకు (కాగితాలు వెదికి చెక్ బుక్ తీస్తాడు. యీ లోగా భర్త సుబ్బన్నను యివతలికి పిలిచి)

భర్త : ఒరే సుబ్బన్నా! అమ్మగార్ని యిల్లంతా తిరిగ్గా చూడమను-ఏం తొందర లేదని చెప్పు. నేను ఎవరో స్నేహితులతో మాట్లాడుతున్నాను. ఇక్కడే వున్నానని చెప్పు? అయ్యగార్ని కూడా దగ్గరుండి యిల్లు, తోట, అన్నీ చూపమను-వెళ్ళు.

సుబ్బన్న వెళ్ళిపోతాడు

విశా : యిదుగో! తమ్ముడూ! నీ పేరేమిటో?—నా కనవసరం! నీవు విషయం త్వరగా తేల్చివెయ్యాలి. నాకు అవతల బోలెడు పనులున్నాయ్? చెప్పు—ఎంత?

భర్త : (ఏం చెయ్యాలో తెలియనట్టు నీళ్లు నములుతూ) హె! హె! యీ ఇల్లండీ చాలా స్ట్రాంగు అయిన దండీ. పూర్వులు మా ముత్తాతలెవరో కట్టించారు. (అని నాలుక కరుచుకుంటాడు)

విశా : నీ ముత్తాత కట్టిస్తే నాకేం! నీ మునిమనమడు కట్టిస్తే నాకేం? ఎంతో చెప్పవయ్యా!!

భర్త : అదేనండి - మరి ఇంటి విషయం, వసతులు వగైరా కొంచెం వినండి మరి!

విశాలాంధ్రుడు రెస్ట్‌లెస్‌గా నిట్టూరుస్తూ వుంటాడు

భర్త : (కంటిన్యూస్‌గా ఏదో చెప్పాలనుకుంటాడు) ఈఇల్లు లొకాలిటీ కూడా చాలా మంచిదండి. ఇంటిముందు తారురోడ్డు, దగ్గరలోనే మార్కెట్టు, పది గజాల్లో హైస్కూలు, ప్రక్కనే సానివీధి.

విశా : ఆఁ!

భర్త : పరవా లేదు ! ఆ ప్రక్కవీధిలో హాస్పిటలూ, పోలీసు స్టేషనూ, జనన మరణ రిజిస్ట్రారు ఆఫీసు... అన్ని విధాల-వీలయిన లొకాలిటీ !

విశా : (విసుగ్గా) అబ్బబ్బ ! ఇంటి ఖరీదు చెప్పవయ్యా !

భర్త : ఇల్లు కూడా చాలా గట్టివస్తువండి. రాతిగోడలు, రంగూన్ కలప, విశాలమైన పడక గదులు, పడకగది ప్రక్కనే కక్కసులు...

విశా : (విసుగ్గా) అసలు ఈ ఇల్లు ఎవడికొక్కవాలయ్యా !

భర్త : (విస్తుబోయి) మరి !

విశా : ఇంటికోసమూ నేను ఇది కొనేది !

భర్త : మరి ?

విశా : (వెక్కిరిస్తూ) మరి ఏమిటి మరి ! తెల్లవారేటప్పటికి యీ యిల్లంతా నేల మట్టం చేసేస్తాను.

భర్త : చేసి ?

విశా : (వెక్కిరిస్తూ) చేసి ఏమిటయ్యా ! అట్టా తెల్లమొఖం వేస్తావ్ ! తెలుగు మొఖమూ అని ! అంతా టీకా తాత్పర్యం చెబితేగాని తెలిసి యేడవదు తెలుగు

సోదరులకి! తెలివితక్కువ సోదరులు! (కోపంగా) విశాలాంధ్ర రాసీ, చెబుతాను! 'తెలుగువాడు' అనే పేరు మార్చి 'తెలివి తక్కువవాడు' అని పెట్టిస్తాను.

భర్త ఇంకా అలానే చూస్తూవుంటాడు

విశా : తమ్ముడూ (శాంతంగా) విషయం చెబుతాను విను; మనకు విశాలాంధ్ర రాష్ట్రం రాబోతుంది. మనకు పెద్ద పెద్ద సిటీలు లేవు! కాబట్టి చిన్న పట్టణాలనే అభివృద్ధి పరుచుకోవాలి. సిటీకి కావలసిన హంగులన్నీ అమర్చుకోవాలి! ప్రతిదానికీ ప్రభుత్వంమీద ఆధారపడకుండా ప్రజలే ముందడుగు వెయ్యాలని పెద్దలు చెబుతున్నారు. అందుకని నా శక్తికొలదీ ఈ పట్టణాభివృద్ధికి పాటుబడ దలుచుకున్నాను. ఇల్లు పూర్తిగా పడగొట్టి, యీ స్థలంలో ఒక నూతన భవనంనిర్మించి అందులో ఒకUpto-date modern Stylish 'విశాలాంధ్రా హెయిర్ కటింగ్ సెలూన్' ఓపెన్ చెయ్యబోతున్నాను.

భర్త : (Shocked) ఆఁ! హెయిర్ కటింగ్ సెలూన్! అంటే మంగలిషాపు!

విశా : అదుగో! ఆమాటే నిషేధం. మనది Secular State! కుల మత ప్రసక్తి కూడదు.

భర్త : అయితే తమరికి క్షౌరకళలో కూడా ప్రవేశముందన్న మాట!

విశా : లేకపోతే సినిమా ఎలా తీశాననుకున్నావ్ ? సొంత డబ్బు పెట్టాననుకున్నావా ?

భర్త : యీ కళను సినిమా కళతో మేళవించారు గదా - మళ్ళీ విడదీస్తున్నారేం ?

విశా : (విసుగ్గా) అబ్బా ! మళ్ళీ తెలుగు ప్రశ్న ! సుమతీ శతకం దగ్గరనుంచీ టీకా తాత్పర్య సహితం అలవాటయి అది లేందే ఇప్పుడేం అర్థంకాదు తెలుగువాడికి. (భర్తతో) వివరించెద నవధరింపుము !

భర్త : మెల్లగా అఘోరింపుము.

విశా : నేను సినిమావ్యాపారం మానేశాను ! ఎందుకంటే - 'అడుగు పెట్టీ పెట్టటంతో అధికలాభాలు వచ్చిన వ్యాపారం వర్జయేత్' - అన్నారు శాస్త్రకారులు - యీ వచ్చిన లాభం కంటే మళ్ళీ రావటం అరుదు- తక్కువ వస్తే మనకి తృప్తి వుండదు. కాబట్టి ఆ వ్యాపారం అంతటితో ఆపమని శాస్త్రకారుల మతం. అందుకు మనం అంగీకరించాం- వెంటనే ఆచరించాం! అర్థమయిందా తమ్ముడూ ! యింకా నన్ను చంపక ఇకనైనా చెప్పు-ఇంటి ఖరీదు ఎంత ?

భర్త సందేహిస్తూంటాడు.

విశా : అబ్బ! డబ్బిచ్చి సొమ్ము కొనుక్కునేవాడి చేత కూడా యింత బ్రతిమాలించుకుంటే ఎట్లాగయ్యా ! చెప్పు ! తమ్ముడూ ! ఎంత ?

భర్త : అబ్బే! అందుకు గాదండి! ఒక్కమాట చెబుదామా; రెండు మాటలు చెబుదామా అని ఆలోచిస్తున్నాను.

విశా : నీ యిష్టం వచ్చినన్ని మాటలు చెప్పు !

భర్త: ముప్ఫయివేలండీ !

విశా : ఆగు ఇక మాట్లాడకు ! ఆమాట మీదే నిలబడు ! (అని గబ గబా చెక్కుబుక్కుతీసి వ్రాయబోతూ) బేరమాడతా ననుకున్నావుగదూ ? దెబ్బ తిన్నావ్ ! బేరం పద్ధతి మన జాతకంలోనే లేదు ! తీసుకో. 30 వేలు ఖచ్చితంగా తీసుకో ! ఇప్పటి కయినా ఆమాట చెప్పావు. అంతేచాలు ! (చెక్కు రాసి చించి యిస్తూ) యిదిగో 30 వేలకు చెక్కు వ్రాశాను—నీ పేరు నువ్వే వ్రాసుకో — (చెక్కు రాస్తాడు) ఆఁ! నేను హోటలు విశాలాంధ్రలో మకాం చేశాను. సాయంత్రం అక్కడికిరా—మా ప్లీడరు చేత రాతకోతలన్నీ పూర్తి చేయిస్తాను ! తెలిసిందా ? ఆఁ, యిల్లు ఎప్పుడు ఖాళీచేసి హేండోవర్ చేస్తావ్?

భర్త : మీ యిష్టం.

విశా : అయితే రేపు సాయంత్రానికి ఖాళీచెయ్యి ! సరేనా?

భర్త : అలాగేనండి.

విశా : అయితే వస్తాను. (అని పోబోయి-ఆగి) అన్నట్టు మరచిపోయాను. నేను మరచిపోతే నువ్వయినా జ్ఞాపకం చెయ్యవేమయ్యా ! తెలుగుబుద్ధి. రశీదు ఎదీ ?

భర్త: ఆఁ మరచిపోయాను. (అని కాగితం కోసం వెతుకుతాడు.)

విశా: కాగితం లేదు - నాకు తెలుసు. ఇదుగో! నేనిస్తాను. (అని సంచిలోంచి కాగితం తీసియిస్తూ) కలంవుందా? వుండదు - నాకు తెలుసు. అవన్నీ వుంటే తెలుగువాడివెట్లా అవుతావు. యిదిగో కలం మళ్ళీ యివ్వు! రాసియివ్వు రశీదు. (భర్త కాగితం కలం తీసుకొని రశీదు రాసి యిచ్చేస్తాడు.)

విశా: (చూచుకుని) Right! బ్రతికించావ్. మరి వస్తాను. సాయంత్రంవచ్చి హోటల్‌లో కలుసుకో. రూమ్ నెం. 4. క్షేమసమాచారాలు తరువాత మాట్లాడుకుందాం. యిప్పుడు బిజినెస్‌మీద వచ్చాను. కాబట్టి అవి మాట్లాడలేదు. బిజినెస్ ఈజ్ బిజినెస్. వస్తాను. (అని హడావిడిగా వెళ్ళిపోతాడు)

భర్త చెక్కు చూచుకుని జేబులో పెట్టుకుంటుండగా అతని భార్య, యజమాని, సుబ్బన్న వస్తారు.

భర్త: (భార్యతో) ఆఁ, ఇల్లంతా బాగా చూశావా? ఎలా వుంది?

భార్య: (నిరుత్సాహంగా) చూశానులెండి! బాగానే వుంది.

యజ: ఎంత బాగుంటే ఏంలాభం! మీరు ఆమెను చాలా నిరుత్సాహపరిచారు.

భర్త: ఎందుకు? కొనవద్దన్నాననా! వూరికే అన్నాను - అలా అంటేగాని ఆడవాళ్ళకి ఆసక్తి పెరగదు. అదీ

గాక తమరి చేత ఆఖరిమాట చెప్పించాలని అలా అన్నాను. మరి ఆఖరికి ఆ పాతికవేలేనా ?

భార్య: (ఆశ్చర్యంగా) ఏమిటీ ! కొంటాలేమిటి కొంపదీసి—

భర్త: ఆఁ. తప్పకుండా! మనదగ్గర నానుడు బేరం పనికి రాదు. (యజమానితో) చెక్కు-రాసి యివ్వ మంటారా ?

యజ: (Surprised )అంతకంటేనా !

భార్య: అంత తొంత రేమిటండీ ? అన్ని విషయాలూ ఆలోచించి కొనుక్కుందాం.

భర్త: ఏమిటి ఆలోచించేది ! మళ్ళీ ఎవడు తిరుగుతాడు. (అని చెక్కు-బుక్కు తీస్తాడు.)

భార్య: అబ్బ ! ఆగండి ఏమిటా తొందర ?

భర్త: ఇదిగో ! ఇదే మీ ఆడవాళ్ళకున్న తెగులు ! (యజమానితో) చూడండి సార్ ! ఇందాక మీ ఎదుటనే అన్నదా కొనమని ? ఇప్పుడు కొంటానంటే వద్దంటున్నది !

యజ: ఆడవాళ్లు గదండి !

భర్త చెక్కు వ్రాస్తుంటాడు.

భార్య: (Anxious గా) నా మాట ఏమయినా వినిపించు కుంటారా ; లేదా !

భర్త: యీ విషయంలో మాత్రం చస్తే వినిపించుకోను - వినిపించుకోడానికి వీల్లేదు. (యజమానితో) ఇవాళ తారీకెంత ?

యజ: 28.

భర్త: అంకె అంత మంచిదికాదు–నిన్నటితేదీ వేస్తాను.

యజ: అభ్యంతరం ఏముంది!

భర్త: (చెక్కు యిస్తూ) ఇదిగో చెక్కు! పాతికవేలు—— చూసుకోండి–మీ పేరు మీరే వ్రాసుకోండి. ఇప్పుడే మీరు మాతో రావాలి. మా ప్లీడరుగారిచేత రాత కోతలు ఇప్పుడే పూర్తి చేయిస్తాను.

యజ: అబ్బే! ప్లీడరుగారి దగ్గరకెందుకండీ, ఎగ్రిమెంట్లు సిద్ధం చేసి వుంచాను. 'ఫలానా వారికి' అని పూర్తి చేయడమే తరువాయి (ఎగ్రిమెంట్లు తీసి) తమపేరు?

భర్త: హరిశ్చంద్రరావు, అవసరాల హరిశ్చంద్రరావు.

యజ: (వ్రాయబోతూ) అబద్ధాల... ...

భార్య: అబద్ధాల కాదండి – అవసరాల–

యజ: క్షమించాలి! అవసరాల హరిశ్చంద్రరావు. (రెండు ఎగ్రిమెంట్లలోను సంతకాలు చేసి భర్త కిస్తాడు. భర్తకూడా సంతకాలుచేసి తిరిగి ఇవ్వబోగా) ఒకటి మీ దగ్గిరుంచుకోండి.

భర్త: ఆఁ ఆఁ అవును. (అంటూ ఒకకాపీ యజమానికిచ్చి) ఆఁ! చూశారూ! యీ ఇల్లు రేపు వుదయానికి ఖాళీ చేసి మాకు హాండోవర్ చేయాలి.

యజ: రేపుదయం! అంతదాకా ఎందుకండీ. యీ క్షణమే మీ కీ ఇల్లు స్వాధీనం చేస్తున్నాను.

భర్త: యీ క్షణమే!

యజ : అవునండీ ! మా కోసం మద్రాసులో పెద్దపెద్ద ఉద్యోగాలు కాచుకుని కూర్చున్నయ్ - ఎప్పుడు వస్తామా ఎప్పుడు వస్తామా అని. ఏరా, సుబ్బన్నా ?

సుబ్బ: చిత్తం ! ఇటు ఈ యిల్లు అమ్మడం ఏంటి, అటు పట్నంబండి ఎక్కడం ఏంటి !

భర్త : మరి యీ ఇంట్లో సామానో ?

యజ : ఏమిటండోయ్ ! బ్రతికి చెడ్డవాణ్ని. అంత నీచంగా చూడకండి. యీ యిల్లు అమ్మానంటే తరు జల నిధి నిక్షేప పాషాణాదులన్నీ మీవే ! నాకూ మా సుబ్బన్నకూ నిత్యకృత్యాల కోసం రెండే రెండు చేతి సంచులు. (సుబ్బన్న రెండు సంచులు తీసుకొస్తాడు) ఇవి తప్ప ఒక పూచికపుల్లకూడా తీసికెళ్ళం. సెలవు. (అని వెళ్ళబోతూ తిరిగివచ్చి) చూశారూ! ఈఫోటో మా ఆవిడది. కీర్తిశేషురాలు. ఈ యిల్లంటే దానికి మహా ప్రాణం ! అంచేత ఈ ఫోటో యిక్కడే శాశ్వతంగా వుంచాలని నా ప్రార్థన.

భర్త : ఓ ! తప్పకుండాను.

యజ : సెలవు !

యజమాని, సుబ్బన్న వెళ్ళిపోతారు

భర్త : (ఈ తర్వాత సంభాషణ జరుగుతూ వుండగా 'ఈ యిల్లు అమ్మబడును' బోర్డుతీసి 'డు' చెరిపి 'డె'రాసి మళ్ళీ తగిలిస్తాడు)

భార్య: ఏమిటండీ-ఈ చాదస్తం! యిల్లు ఏమీ బాగాలేదు. మేడమీద కొంత కూలిపోయికూడా వుంది. పాతిక వేలు బూడిదలో పోసినట్టే-అంత తొందర అయితే ఎట్లాగండి చచ్చేది. (అని కన్నీరు పెట్టుకుంటుంది)

భర్త: ఏం చావమంటావే మరి. కొనకతప్పలేదు.

భార్య: ఏం ప్రాణంమీద కొచ్చింది ?

భర్త: తీరా అమ్మేశాను మరి !

భార్య: ఏమిటి ?

భర్త: యిల్లు !

భార్య: ఏ యిల్లు ?

భర్త: ఈ యిల్లే-అందరూ కొనినతరువాత అమ్ముతారు - నేను అమ్మినతరువాత కొన్నాను. అంతే తేడా.

భార్య: ఏమిటండీ మీరు అనేది ?

భర్త: యిప్పుడే బుద్ధి వికసించిన ఒక విశాలాంధ్రుడొచ్చి నా దగ్గర యీ ఇల్లు 30 వేలకుకొనుక్కుని వెళ్లాడు. మరి మనం కొనకపోతే వాడికి అమ్మిందెలా చెల్లడం ?

భార్య: ఎవరిదో లోకులయిల్లు మీ దగ్గర కొన్న ఆ వెధవ ఎవరండీ, తలమాసిన వెధవ !

భర్త: ఇస్ ! తిట్టబోకే. (రహస్యంగా) వాడి వాగుడు వాలకం చూస్తే రాబోయే విశాలాంధ్ర రాష్ట్రంలో మంత్రో మాకో అయేటట్టున్నాడు.

భార్య: అయితే యింతకూ—(అనిఏమో చెప్పబోతూంటే)

భర్త: మనకు ఐదువేలు లాభం! వివరాలు యింటికి వెళ్ళిన తరువాత చెబుతాను-పద. (అని భార్య, భర్త లేవబోతుంటే సి. ఐ. డి. ప్రవేశం)

సి.ఐ.డి: ఈ ఇంటి యజమానురాలు తమరేనా?

భర్త: ప్రస్తుతానికి నేనే - కాని లాభం లేదు.

సి.ఐ.డి: ఏం లాభం లేదు?

భర్త: (బోర్డు చూపించి) 'ఈ యిల్లు అమ్మబడెను' చూశారా-అదీ సంగతి. పాపం యీ యిల్లు కొనాలని వచ్చి వుంటారు-అలా కొనాలనివుంటే విశాలాంధ్ర హోటల్, రూమ్ నెంబరు 4. కి వెళ్ళండి.

సి. ఐ. డి: ఎందుకూ?

భర్త: ఈ యిల్లు కొన్నాయన అక్కడ వున్నాడు కాబట్టి. లక్షాధికారి! 'కదిలావా కబడ్దార్' సినిమాతీసి లక్షలకు లక్షలు గడించిన ప్రవాసాంధ్రుడు - ప్రస్తుతం విశాలాంధ్రుడు.

సి.ఐ.డి: (కనువిప్పయి) ఈ యిల్లు ఆయన కొన్నాడు?

భర్త: అవును.

సిఐ.డి: ఏం బెట్టి?

భర్త: (వేళాకోళంగా) డబ్బెట్టి!

సి. ఐ. డి: లొంక్కా-మే!

భర్త : ఆం రొఖ్ఖమంటే రొఖ్ఖం కాదనుకోండి ప్రస్తుతానికి చెక్కు (చెక్కు తీసి ఝళిపిస్తూ) కాసేపాగితే అదే రొఖ్ఖమవుతుంది.

సిఐ.డి: కాసేపాగితే కాగితం ముక్కవుతుంది.

భర్త : ఎవరో మీరు? కొంచెం వళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడండి.

సి.ఐ.డి. లేకపోతే ఆ పిచ్చివాణ్ణి నమ్మి యెలా అమ్మా వయ్యా యిల్లు?

భర్త : (ఖంగారుగా) ఆం! పి... పి... పిచ్చివాడా?

సి.ఐ.డి: కాక! మొదట బాగా బతికినవాడే! రెండు మూడు లక్షలు సంపాయించాడు-ఎవడో యెక్కించాడు- 'సినిమా - తియ్యి - లక్షకు పదిలక్షలు వస్తాయ'ని - దానితో సినిమా తీశాడు.

భర్త : ఉరి యింకేం!

సి.ఐ.డి: సరే ఒక్కరోజైనా ఆడితేనా! ఫ్లయింగ్ సాజర్ లాగా వచ్చిందారినే వెళ్ళిపోయింది. దమ్మిడీ రాక పోగా తలమునిగే అప్పులు! దాంతో పిచ్చెక్కితే పిచ్చాసుపత్రిలో చేర్చారు. నిన్న తప్పించుకు పారి పోయాట్ట. పోయేవాడు వూరికనేపోక సూపర్నింటెం డెంటు హేన్డ్ బేగ్ తీసికెళ్ళాట్ట. దాంట్లోవున్న

చెక్కు-బుక్కు-తో కనిపించిన ప్రతివాడికీ చెక్కు రాసి స్తున్నాడుట. రిపోర్టు వస్తే ఆయనకోసం వెతుకుతు న్నాం. యిటు వచ్చాడని తెలిస్తే యన్‌క్వాయిరీ చెయ్యడానికి వచ్చాను.

భర్త: (ఏమీ పాలుపోక)... ... తమరు ...

సి ఐ.డి: సి.ఐ.డి ఇనస్పెక్టర్‌ని. వస్తాను! (Exit)

భార్య: కొంప ముంచారుగదండీ!

భర్త: నేనా! వెంటనే పోదామే అంటే, 'వుండండి వుండండి' అని నువ్వేగా ప్రాణం తీసింది.

భార్య: అయితే నే కొనమన్నానుటండీ?

భర్త: అన్లా 'నా కట్నం తాలూకు 10 వేలూ యిలా పారెయ్యండి - నే కొనుక్కుంటా' నన్లా!

భార్య: అంటే! తర్వాత కొనాలని పట్టుపట్టింది మీ రేగా- ఎవడో పిచ్చిముండాకొడుకు 30 వేలకు కొన్నాడని. ఏమీ ఆలోచించకుండా 25 వేలకు చెక్కు రాసిస్తిరి. చెక్కు మార్చుకున్నాడో? ఏమో?

భర్త: (బిగ్గరగా ఏదో జ్ఞాపకం వచ్చినట్టు) అవునోయ్! మర్చిపోయాను! ఫోను!

భార్య: అమ్మగో! మీ కళ్ళముందే వుంది. పని చేసేదో చెయ్యండో.

భర్త: (ఫోనుతీసి) హల్లో! హల్లో! హల్లో! ఆఁ! ఆఁ! విశాలాంధ్రుడు కావాలండీ-కాదు! కాదు! ఆంధ్రా బాంకి కావాలి... నంబరా? నెంబరు... ... (తెలిఫోను గైడు తిరగేసి) 3 9 4 కాదమ్మా తల్లీ 433 కాదు—3 9 4 మూడు, తొమ్మిది, నాలుగు!- ఎంగేజ్‌డా! చచ్చాం. (ఫోనుపెట్టి కంగారుగా ఇటూ అటూ తిరుగుతాడు) (మళ్ళీ ఫోనుదగ్గరకు వచ్చితీసి) హలో! ఆంధ్రబ్యాంకి 394—3-9-4 అర్జెంట్- కొంపలు మునిగిపోతున్నాయ్-హల్లో ఎక్ఛేంజ్! తల్లీ నీ కాళ్ళకు మొక్కుతాను - సలాం చేస్తాను. ప్లీజ్ అర్జెంట్ (ఖంగారుగా) ఆంధ్రాబ్యాంకా! నేనూ పాతిక వేలకు ఇప్పుడే చెక్కిచ్చాను. డబ్బివ్వకండి! సారీ! సారీ! పాతికవేలకు యిప్పుడే చెక్కిచ్చాను. డబ్బివ్వకండి! నా పేరా, నా పేరు—నా పేరు నా పేరు (భార్యవేపు తిరిగి) నా పేరేమిటే?

భార్య: ఏం సోద్యమండీ! మీా పేరు మీారే మర్చిపోయారా?

భర్త: అవునే మరిపోయానే, చెప్పవే!

భార్య: అయ్యో! మీా పేరు నేనెలా చెప్పనండి?

భర్త: చెప్పవే! చస్తుంటే.

భార్య: అయ్యో! ఖర్మ... అవసరాల హ...

భర్త: ఆఁ ఆఁ (ఫోనులో) అవసరాల హరిశ్చంద్రరావు.

భార్య: ఏమన్నాడండీ?

భర్త : కనుక్కుని చెప్తారట. (ఫోన్లో) ఆం ఆం ఏమిటీ? చెక్కు-
మారిపోయిందీ? డబ్బిచ్చేశారూ? హా! చంద్రమతీ!
(అని భర్త నేలకూలతాడు)

---

పాత్రలు :

ఏడుకొండలు

పున్నయ్య

తిరువెంగడం

గోపాలరావు

వాణీప్రసాద్

కామాక్షి



1951 తెనాలి నాటక కళాపరిషత్తు సమా
వేశంలో ప్రదర్శించినప్పుడు పాత్రధారులు

| | | |
|---|---|---|
| ఏడుకొండలు | : | శ్రీ మాచినేని వెంకటేశ్వర రావు |
| పున్నయ్య | : | శ్రీ K. వెంకటేశ్వర రావు |
| తిరువెంగడం | : | శ్రీ V. రామన్న పంతులు |
| గోపాలరావు | : | శ్రీ K. V. S. శర్మ |
| వాణీప్రసాద్ | : | శ్రీ శ్రీరామమూర్తి |
| కామాక్షి | : | శ్రీమతి R. నిర్మల |

# ఆత్మహత్య

తెనాలి పట్టణం నాటక కళకు పుట్టినిల్లు. ఆంధ్రదేశములో ప్రఖ్యాతి చెందిన నటులు చాలామంది తెనాలివారే. గొప్పగొప్ప నాటక సమాజాలు యీవూళ్ళోనే వెలసినై. ప్రథమంగా నాటకకళా పరిషత్తుకు సురభి గోవిందరావు ప్రభృతులచే స్థాపించబడినది యీ వూళ్ళోనే.

అటువంటి తెనాలిలో ఒక చిన్నహోటల్లో ఒక చిన్నగది. యీ వూరికి వచ్చే హాయ్యే నటీనటులకీ, నాటకసమాజాలకీ యీ గదే ప్రత్యేకంగా అద్దెకిస్తుంటాడు హోటలు ప్రొప్రయిటరు పున్నయ్య.

తెర లేచేసరికి గదిలో ఏడుకొండలు ఒక్కడే వుంటాడు. ఒక చిన్న కత్తి పిడికిట్లో పట్టుకుని, దానివంక ఆవేశంగా చూస్తూ, వుద్రేకంతో వూగిపోతూ—ఒక్కసారి అమాతం గుండెల్లో పొడుచుకుని 'హా' అని నేలమీదకు ఒరిగిపోయి, గిలగిలా తన్నుకుంటూంటాడు.........

తలుపు చప్పుడు.

ఏడుకొండలు: (పడుకుని వుండే) ఎవరది ?

పున్నయ్య: (బయటనుంచి) నేనే; పున్నయ్యనండి !

ఏడు : రండిలోపలికి.

పున్నయ్య ప్రవేశం. యాభై పైబడ్డ వయస్సు.
మనిషి నిండుగా మత్తుగా వుంటాడు.

పున్న: క్రింద పడుకున్నావేం, ఏడుకొండలు ! మంచం వుండగా !

ఏడు : (మెల్లగా లేవబోతుంటాడు)

పున్న: పడుకో, పడుకో. లేవకు! నే వెళతాను.

ఏడు : ఎబ్బే! పడుకోలేదు పున్నయ్యా!—(లేచి మన్ను దులుపుకుంటూ) ఆత్మహత్యసీను రిహార్సలు చేసు కొంటున్నాను. దీనిదుంపతెగా - యీ ఆత్మహత్య వుండే - యింత ప్రాణాంతీసేది మరోటి లేదయ్యా! నాటకంలో మరొకడితో యుద్ధం చేసి చావమనండి, వురిపోసుకుని చావమనండి, లేక విషంతాగి చావ మనండి-అద్భుతంగా చేస్తాను. కాని ఒక కత్తితో మనకి మనం పొడుచుకు చావడమంటే - ప్రాణం మీదికొస్తుంది.— యీ సీనుమట్టుకు యీసీను లక్ష సార్లు రిహార్సలు చేశా! ఏం ప్రయోజనం! నాటకం నాడు మట్టుకు పొడుచుకోకముందే క్రిందపడిపోతా!

పున్న: కష్టమే లే—చూస్తూ చూస్తూ అకారణంగా పొడుచు కొని చావాలంటే... ...

ఏడు : నాకే గాదయ్యోయ్! యీ అవస్థ. పెద్ద పెద్ద యాక్ట ర్లకే వుంది. మన బళ్లారి రాఘవాచార్యులుగారు గూడ - 'నాకు స్టేజీమీద ఆత్మహత్య అంటే చెడ్డ చిరాకు' అని అనేకసార్లు అంటూండే వారని నా మిత్రు డొకడు నాతో అన్నట్టు జ్ఞాపకం.

పున్న: అవునవును ఒక్కొక్కళ్ళకి ఒకోటి యిష్టం. చచ్చి ఏ లోకాన వుందో - శ్రీరంజని-నాతో అంటుండేది ఆవిడకి స్టేజీమీద అదేపనిగా ఏడ్చి ఏడ్చి చావడం

సరదా ! రామతిలకానికి చచ్చి మళ్ళీ బ్రతకడమంటే సరదా ! రామనాధ శాస్త్రికి...

ఏడు : (ఆసక్తితో) రామనాధశాస్త్రిగారు నీకు తెలుసా?

పున్న: అయ్యో ! నాకు చాల ఆప్త మిత్రుడయితే !

ఏడు : గొప్పనటుడు ! (అని నమస్కరిస్తాడు.)

పున్న: ఒక రామనాధ శాస్త్రిమిటి? యడవల్లి సూర్యనారాయణ, బళ్ళారి రాఘవాచార్లు, తుంగల చలపతి, జొన్నవిత్తుల శేషగిరి అసలు ఆంధ్ర దేశంలో నటుడన్న వాడు యీవూరు వస్తే మన హోటల్లో నేగదయ్యా బస.

ఏడు : నీవు నిజంగా పూర్వజన్మలో ఎంత పుణ్యం చేసుకున్నావో, పున్నయ్యా !

పున్న: వాళ్ళందరి ఫొటోలు మొన్నటిదాకా యీగోడలకి తగిలించి వుండేవి. మొన్న సున్నం గొట్టించేప్పుడు తీశాను. మళ్ళీ తగిలించాలి ... ఎంతమంది మహానటులకు ఆశ్రయమిచ్చిందను కున్నావు-యీ గది !

ఏడు : అటువంటి యీ గదిలోనే నేనుగూడా వుండేభాగ్యం గలగటం నిజంగా నా పూర్వజన్మ సుకృతం పున్నయ్యా! (తన్మయంతో షడన్‌గా) ఆ! చెప్పటం మరచాను ! రాత్రి నాటక మయ్యాక వచ్చి పండుకున్నానా ! కలలో ఒకమహానటుడు కనిపించాడయ్యా! ఆయన ఎవరో సరిగా గుర్తుబట్టలేదు గాని - మొత్తం మీాద ఎవరో మహానటుడే ! సందేహం లేదు.—కని

పించి చెప్పాడుగదా ! 'ఒరే! ఏడుకొండలూ ! మేం పోయినా నీలాంటి వాళ్లుండబట్టే యీ పౌరాణిక నాటకాలు యింతవరకూ బతికున్నాయ్ ! ఈ కొత్త సాంఘిక నాటకాల దాడినుంచి మన పురాతన నాటకాలను రక్షించేభారం నీది. నీకుఅండగా మేమంతా వుంటాం. సాగించు - పోరాటం' అని వీపు చరిచి హెచ్చరించాడు పున్నయ్యా !

పున్న: అంతేబాబూ ! అంతే! యీ గదిలో మకాం చేసే ప్రతి నటుడితోనూ వాళ్లుఅలాగే మొరబెట్టుకుంటూం టారు. ఏం జేస్తారు మరి ! వాళ్ళ ఆత్మలకి శాంతి లేక !...

ఏడు : అందుకే గాబోలు పున్నయ్యా ! పొద్దుటినుంచి నా కేదో శక్తి వచ్చినట్టు అనుమానంగా వుంది. యీ రాత్రికి చూచుకో ఎట్లా యాక్టు చేస్తానో.

పున్న: అన్నట్టు యివాళ ఏమిటి నాటకం ?

ఏడు : 'జాంబవతీ పరిణయం' మోత!—యిదుగో కరపత్రం చూశావా ! (అని తీసి చదువుతాడు)

యీ నాటకంలో శ్రీ కృష్ణ జాంబవంతుల భీకర యుద్ధం చూచి స్వయంగా ఏడ్వవలసినదే గాని, యిక్కడ వ్రాయ నలవికాదు. జాంబవతీ పాత్రధారిణి అభినవ మంకీ బ్రాండ్ ...

పున్న: అంటే కోతిమూతి పెడతారా ?

ఏడు : ఓ! దాన్ని గురించి పెద్ద పెద్ద పండితుల్ని కన్సల్ట్ చేశాం. జాంబవతి తల్లిపోలికా, తండ్రి పోలికా అని మీమాంస వచ్చింది. చివరికి తండ్రి పోలికే నని పండితులంతా ఏకగ్రీవంగా అంగీకరించారు.

పున్న : నాటకం పాతదేనా, ఏమైనా మార్పులు...

ఏడు : పాతనాటకాన్నే - కొత్తవాళ్ళచేత వ్రాయించి, సరి కొత్తగా తయారు చేయించాను.

పున్న : అహాఁ- నే నడిగేది - వీరరస ప్రధానమా, భక్తిరస ప్రధానమా ?

ఏడు : ఆ రసమేమిటి, యీ రసమేమిటి-అన్ని రసాలమిక్చర్. మొన్న బందర్లో నాటక మాడితే—నా వైఫ్ ఫీలింగ్స్ చూసి, ఆడియన్సంతా అదే పనిగా వల వల వల మని ఒకటే యేడుపు ! యిక అదే పనిగా ఏడి పిస్తే బాగుండదని - నేనే నా వైఫ్‌ని ఫీలింగ్స్ కొంచెం కట్ చెయ్యమన్నాను.

పున్న : అవునవును. టూమచ్ అయినా అంత బాగుండదు. రాత్రి నాటకానికి డబ్బేమాత్రం వచ్చింది ?

ఏడు : ఏముంది ? హౌస్‌ఫుల్, కాష్ నిల్. అన్నీ కాంప్లి మెంటరీలే ! పోలీసు డిపార్టుమెంటువారు, వినోదం టాక్స్ డిపార్టుమెంటువారు, మునిసిపాలిటీవారు సకు టుంబ సపరివార సమేతంగా విచ్చేసి రిజర్వ్డ్‌క్లాసు మొత్తం ఆక్రమించారు. హాలువారు అద్దెగాక ఫస్టుక్లాస్ కాంప్లిమెంటరీలు పుచ్చుకున్నారు. యివ

తల క్లాస్ల్లో సందు లేకుండా ఉన్నయ్గాని కుర్చీలు,
10 కుర్చీలకి ఒకమనిషి వుంటే వొట్టు! యింకేం
ఏడుస్తాం పున్నయ్యా, చెప్పుకుంటే సిగ్గుచేటు.

పున్న: అంతే గాదులే బాబూ! యిదుగో యీ కొత్తరకం
పద్యాల్లేని నాటకాలొచ్చినై-సాంఘిక నాటకాలంట-
వీటమ్మటబడ్డారు జనం! మరీ యీ పట్నవాసాల్లో
బహు జోరుగావుంది వీళ్ళ పని! ఏవో పరిషత్తు
లంట! శాఖలంట!

ఏడు : నిజం చెప్పావు పున్నయ్యా! యీ బస్తీలలో నాట
కాలు ఆడినంత బుద్ధితక్కువ యింకోటిలేదు. మన
పురాణ నాటకాలకి పల్లెటూళ్లే రైటనుకో!

పున్న: కదూమరి! పల్లెజనం అంటే సత్యకాలపువాళ్ళు!

ఏడు : కాని యింకో చిక్కుంది పున్నయ్యా! నాటకం
గనక బాగోపోతే బస్తీలో అయితే ఒట్టి తిట్లతోనే
పోతుంది. కాని పల్లెటూళ్ళల్లో వీపులు చెడతయ్
పున్నయ్యా! పారిపోదామన్నా వీలుండదు.

పున్న: (నవ్వి-బల్లమీదవున్న పూలగుత్తి ఒకటి చూస్తాడు)
ఎక్కడ కొన్నావు బాబూ! యిది చాలాబాగుంది?

ఏడు : అదా? చెప్పటం మరచిపోయాను. రాత్రి ఒక
గమ్మత్తు జరిగింది. నాటకం అయిన తరువాత ఒక
పెద్దమనిషి ఎవరో గ్రీన్రూమ్ దగ్గరికొచ్చి, గేటులో
కుర్రాడి కిదిచ్చి 'ఇది కామాక్షికి నా కానుకగా
ఇవ్వు' అన్నాట్ట. 'మీ పేరేమిటి' అని అడిగితే—

'నా పేరెందుకులే - పేరెందుకులే' అని చకచకా వెళ్ళిపోయాట్ట. నిజంగా నేను ఎంత ఆనందించా ననుకున్నావ్?— వెధవడబ్బు - డబ్బుదేముంది? నా భార్య నటనా కౌశలాన్ని మెచ్చుకోగలిగిన రసజ్ఞుడు ఒక్కడైనా యీ వూళ్ళో వున్నాడు - అంతే చాలు ననుకున్నాను. (పూలగుత్తి చేతబట్టి)-ఖరీదు ఎంత యితే యేం. కానుక కానుకే! - అందుకే ఒక కవి యేమన్నాడో తెలుసా పున్నయ్యా!

'కళాపిపాస హృదయమ్ము కలచివేయ,
కార్చినాడొక వేడి కన్నీటిబొట్టు!—'

(Pause) కవిత్వం చెబడానికేం, బాగానేవుందిగాని; యిటువంటి కానుకల్తో కడుపులు నిండుతయ్యా! రేపు యిది తీసికెళ్ళి స్టేషనుమాష్టరుకు చూపిస్తే, టిక్కెట్టు లేకుండా రైలెక్కనిస్తాడు?

పున్న: నువ్వేం దిగులుపడొద్దు ఏడుకొండలూ. మా వూళ్లో నాటకమేసిన వాడెవడూ నష్టంతో బయటికిపోడు. పెద్దవాణ్ణి నే జెబుతున్నాగా! చూడు! మీ కష్టం ఫలిస్తుంది. యింత కష్టపడి 'జాంబవతీ పరిణయం' నాటకమాడితే ఆ శ్రీకృష్ణపరమాత్మ మిమ్మల్ని ఆమాత్రం కనికరించడూ!

ప్రవేశం - కామాక్షి. బజారునుంచి ఏవో వస్తువులు కొనితెస్తుంది.

కామాక్షి: ఏం జేస్తున్నారు?

ఏడు : యింతసేపున్నావేం, బజారుకెళ్ళి!

కామాక్షి: బజార్లో మన నాటకం ఎడ్వర్ టైజుమెంటు ఎంత బ్రహ్మాండంగా వుందనుకున్నారు ? - ఒకడికి జాంబవంతుడి వేషం, ఒకడికి జాంబవతి వేషం వేసి, రెండెడ్ల బండిమీద కూచోబెట్టారు. బండినిండా రంగు కాగితాలు - వెనక బ్యాండుమేళం. అబ్బ, ఎంత బాగుందని! చుట్టూ జనంమూగి కేకలు బెడుతూ, సంతోషం పట్టలేక బండిమీదికి రాళ్ళు విసురు తున్నారు.

వీడు : రాత్రి నాటకంలో స్టేజీమీదకి విసరరుగదా !

కామాక్షి: నన్ను చూస్తే నా వెంట ఎక్కడ పడతారోనని- సందుగొందులన్నీ తిరిగి తప్పించుకొచ్చా !

పున్న: అంతేనమ్మా!—యీవూళ్ళో ఎప్పుడూ అంతే !

వీడు : యివాళ నాటక మైపోయి, రేపు యీ వూరినుంచి బయట పడే దెట్లాగా అని. రైలు కర్చులకి గూడ డబ్బులు లేవు.

పున్న: యిక నే వస్తా (అని వెళ్లబోతాడు)

వీడు : యిదుగో పున్నయ్యా ! రేపల్లె ఎంత దూరం యిక్కడికి ?

పున్న: ఆఁ, ఎంత ! రైల్లో గంట ప్రయాణం.

వీడు : రైలుగాదు—రోడ్డున ఎన్ని మైళ్ళు ?

పున్న: ఆఁ, 20 మైళ్ళు. (అని వెళ్ళబోతాడు.)

ఏడు : (కామాక్షితో) మీ ఆడవాళ్ళంతా పొద్దున్నే రైలుకి పదండి. మొగాళ్ళమంతా నడిచో ఎట్లాగో చేరు కుంటాం.

కామాక్షి: నడిచా! యీ ఎండల్లో - మీకాళ్లకి చెప్పులన్నా లేవు.

ఏడు : చెప్పు లెక్కట్టుకుంచావ్ స్తయ్. నాలుగు రూపాయ లుంటే, నువ్వే బజారుకెళ్ళి ఏవేవో కొనుక్కొస్తివి.

కామాక్షి: నా తలవెంట్రుకలకి రంగు అయిపోయిందండి. అందుకని రంగుపొట్లం ఒకటి కొనుక్కొచ్చానండి.

ఏడు : అవున్లే. అదీ అవసరమేగా! ఆ తెల్లవెంట్రుకలు బయట పడితే (పూలగుత్తి చేతబట్టి) యిటువంటి రసజ్ఞులంతా యిక మనమొఖం చూస్తారా?

కామాక్షి: ఆయన ఎవరై యుంటాడండి.

ఏడు : ఏవడో పాపం, నీ యాక్టింగ్ చూచి, అమాతం ఐస్ అయిపోయుంటాడు.

కామాక్షి: మీకు అసూయగా వుందిగదూ?

ఏడు : ఛ, ఛ. అసూయేమిటి; అమితానందంగా వుంటే! ఇటువంటి వాళ్ళు వూరికి ఒకడైనా వుండబట్టే మన నాటకాలు యింతవరకు బ్రతికున్నాయ్.

కామాక్షి: ఆఁ, చెప్పటం మరిచానండోయ్! యీవాళ నాటకంలో జాంబవతి వేషానికి ఆ 'కోతిమూతి' తగిలించుకోనండి.

ఏడు : ఏమిటి ? కోతిమూతి తగిలించుకోవూ ? కోతిమూతి లేకపోతే యిక జాంబవతికి, సత్యభామకి భేద మేముంది ?

కామాక్షి: శ్రీకృష్ణుడి భార్యకి కోతిమూతి ఏమిటండీ ?

ఏడు : శ్రీకృష్ణుడి భార్య అయేది, వైస్రాయ్‌గారి భార్య అయేది - జాంబవతికి కోతిమూతి వుండాల్సిందే. జాంబవతి తండ్రి పోలికేనని మన పండితులంతా ఏకగ్రీవంగా ఆమోదించారు.

కామాక్షి: ఏమోనండీ. నామూతిచూసి ప్రేక్షకులంతా నవ్వు తున్నారు.

ఏడు : ఎవరు నవ్వేది ? ఆడప్రేక్షకులా; మొగప్రేక్షకులా ?

కామాక్షి: మొగ ప్రేక్షకులే.

ఏడు : అసలు నువ్వు యాక్టుచేసేప్పుడు మొగప్రేక్షకులవంక ఎందుకు చూడ్డం? మనకి కావలసింది ఆడప్రేక్షకులు. వాళ్ళకే భక్తి యెక్కువ. వాళ్ళంతా నీ యాక్షన్ చూసి నువ్వు కేవలం ఆ కృష్ణపరమాత్మ యిల్లాలి వని, భక్తితో నోరెళ్ళబెట్టి, గుడ్లు మిటకరించి, భజ నలు చేస్తున్నారు. మొన్న బెజవాడ నాటకంలో ఒక చిన్నపిల్ల భక్తిపారవశ్యంలో మూర్ఛబోయింది గూడా !

కామాక్షి: మూర్ఛపోయింది భక్తివల్లో, భయంవల్లో !

ఏడు : గిట్టనివాళ్ళు 'భయమే' నంటారు ! మనకెందుకు వాళ్ళతో.

కామాక్షి: ఆఁ. ఆ డ్యాన్సుకూడ తీసెయ్యాలండి.

ఏడు : (కోపంతో) ఏం యివాళ సీకిలా పుట్టింది. అన్నీ తీసెయ్యమంటున్నావ్ ?

కామాక్షి: ఆ డ్యాన్సుచూసి, జనం ఈలలువేసి, కేక లేస్తున్నారు. ఎవళ్లో స్టేజిమీదకి రెండు రాళ్లుకూడ వేశారు.

ఏడు : మరి అట్లా కోతిగంతులువేస్తే రాళ్ళెయ్యరూ.

కామాక్షి: కోతి, కోతిగంతులెయ్యక ఏగంతు లేస్తుంది మరి!

ఏడు : ఓసి పిచ్చిదానా ! నీ కసలు ఆ పాత్రే అర్థంకా లేదు. కోతి అంటే సామాన్యపు కోతిగాదు. చదువూ, సంగీతము, నాట్యం నేర్చిన కోతి. సాక్షాత్తు ఆ కృష్ణ పరమాత్మను తన భక్తితో ఆకర్షించిన కోతి —అది ఎంత లావుకోతో ఆలోచించుకో — నటి అంటే పాత్రని అలా తర్కించి, అర్థంచేసుకోవాలి.

కామాక్షి: ఏమన్నా కానీండి! నే నివాళ ఆడాన్సు చేయను.

ఏడు : నువ్వు చెయ్యకపోతే ప్రేక్షకులు ఊరుకుంటారా ! డ్యాన్సో డ్యాన్సో అని గగ్గోలు పెడతారు.

కామాక్షి: అయితే ఇంకేదన్నా డ్యాన్సు నేర్పండి. ఆ డ్యాన్సయితే నేను చేయనే చేయను.

ఏడు : అయితే - యీ డ్యాన్సు చూడు — (అని డ్యాన్సు చేస్తాడు) "కలకలా ఆ కోకిలేమో, పలుకరించే వింటివా ?"—

కామాక్షి: (లేచి అతనితోపాటు డ్యాన్సు చేస్తుంది)

ఏడు : అలా కాదు. ఇలా వయ్యారంగా నడవాలి. (అని చేసి చూపిస్తాడు.)

కామాక్షి: బాగా రావడం లేదండి.

ఏడు : ఇవాళ నాటకం ఎలాగో నెట్టేసెయ్. రేపు రేపట్లె నాటకానికి బాగా తర్ఫీదు చేస్తాను.

కామాక్షి: తరువాత గుడివాడ, నాటకానికి అద్భుతంగా డ్యాన్సు చేస్తానండి.

ఏడు : గుడివాడ ! అక్కడ నువ్వు ఎంత అద్భుతంగానైనా చెయ్యి, ఏమీ లాభం లేదు. ఆ జనానికి మన నాటకాలు గిట్టనే గిట్టవ్. మన నాటకాలకి గుడివాడంత దరిద్రపు సెంటర్ మరొకటి లేదనుకో.

కామాక్షి: యిదివరకు డబ్బు బాగానే వచ్చేది గదండీ, గుడివాడిలో!

ఏడు : యిదివరకు సంగతి వేరు - ఇప్పుడు సంగతి వేరు. ఆ వూళ్ళో ప్రస్తుతం పరిషత్తు తాలూకు నలుగురు ప్రబుద్ధులు చేరారు. ఏవో శాఖలట - సాంఘిక నాటకాలంట- చూడు, రేపు మద్రాసు వెళ్ళినప్పుడు మన మంత్రిగారితో మాట్లాడి యీ కళాపరిషత్తును అమాంతం బ్యాన్ చేయించేస్తాను.

కామాక్షి: ఆఁ, మీరు చెయ్యమంటే చేస్తారేమిటి ? వాళ్ళు, వాళ్ళు అంతా ఒకటే.

ఏడు : ఓసి పిచ్చిదానా ! నువ్వుగూడ అందరిలాగే అనుకుంటున్నావ్ ! మనకి మంత్రిగారిదగ్గిర ఎంత పలుకు

బడి వుందో తెలుసా ?— ఆఁ, మొన్న వినోదపు పన్ను ప్రభుత్వం రద్దుచేసింది తెలుసా ?

కామాక్షి: అవును.

ఏడు : ఆ రద్దు చేయించిం దెవరు ?

కామాక్షి: మంత్రిగా రటగా !

ఏడు : మంత్రిగారేలే! ఆ మంత్రిగారికి చెప్పి చేయించిం దెవరు ?— నేను! "ఏమండీ యీ వినోదపుపన్ను మీరు తప్పనిసరిగా రద్దు చేయాలి" అని గట్టిగా చెప్పాను. అంతే! రద్దుచేసేశారు.

కామాక్షి: నిజంగానండి ! ఏమోనబ్బా !... ...

ఏడు : (విస్తుబోయి) ఏం నీకు నమ్మకం లేదా ?—చేసుకున్న పెళ్లానివి, తోటి నటివి నువ్వే నమ్మకపోతే, ఇంక లోకు లేం నమ్ముతారు ?

కామాక్షి: లోకులసంగతి మన కెందుకులెద్దురూ.

ఏడు : మన కెందు కేమిటి ? లోకులకోసం కాకపోతే ఎవరి కోసం యీ నాటకాలాడ్డం ? దేశం అధోగతిపాలవు తోంది. కూలిజానాభా పెరిగిపోతోంది. కూటికీ గుడ్డకీ వాచ్చేసింది. లక్షలమంది ప్రజలు అంటు వ్యాధులకి ఆహుతి అయిపోతున్నారు. నాయకుల్లో కలతలు బయలుదేరినై. బ్లాకుమార్కెట్టు పెచ్చుపెరిగి పోతోంది. దొంగదేశభక్తులు తయారవుతున్నారు. దీనికంతకూ కారణమేమిటి ? ప్రజలలో దైవభక్తి సన్నగిలింది. నాస్తికత్వం ప్రబలిపోతోంది. దీనికి

ఒకటే విరుగుడు. ప్రజలలో దైవచింత పెంపొంద్య దించాలి. ఆధ్యాత్మిక శక్తిని అభివృద్ధి చెయ్యాలి. అందుకోసం జాంబవతీ పరియణంలాంటి ఉత్తమ నాటకాలను వూరూరా, వాడవాడలా విరివిరిగా ప్రదర్శించాలి. ఇలాంటి నాటకాలకు ప్రభుత్వం తగిన ప్రోత్సాహంయివ్వాలి. పురాణ నాటకాలను ఖండించే వాళ్ళమీద 144 శెక్షను జారీచెయ్యాలి. దేశ క్షేమానికి ఇంతకంటే వేరే మార్గం లేదు. యిందుకు నే నిప్పుడే కంకణం కట్టుకున్నాను. పురాణ నాటకాలను పునరుద్ధరిస్తాను. స్వర్గస్థులైన ఓ ఆంధ్ర మహా నట నటీమణులారా? నన్నాశీర్వదించండి. మీరందరూ నాలో ప్రవేశించి, నాకు వుత్తేజాన్ని కలిగించండి.

(దండకం) ఓ కులదేవతల్లార! స్వర్గస్థులైనట్టి ఓ ఆంధ్ర నటులారా! రంగమార్తాండుడా రామనాథ శాస్త్రీ! నాటీయాచార్యుడా యడవల్లి సూరయ్యా! బళ్లారి రాఘవా! సురభి గోవిందయ్యా! నెల్లూరు నగరాజ! రామతిలకమ్మ! పలకండి! కదలండి! నీ శిష్యుడైనట్టి, నీ బంటునైనట్టి, నా మొరాలించి, నా కోర్కె మన్నించి, దేశాన్ని కరుణించి, పురాణ నాటకాల్ పునరుద్ధరించండి! మీ అండగావున్న, మీ వెంటనేవున్న భూతప్రేతంబులన్, పిశాచాది గణంబులన్ బంపి, మన శత్రులన్ బట్టి, ఛేదించి, సాధించి, పీడించి, చెండాడి, మముం బ్రోవ రే, వేగ

కాపాడరే, మమ్మురక్షింపరే— పాహిమాం, పాహి పాహిమాం...

మధ్యలో కామాక్షిగూడ కూర్చుని ప్రార్థించుతుంది. ఏడుకొండలు లేచి, పూనకం వచ్చినట్లు వూగిపోతాడు.

కామాక్షి: శాంతించండి, శాంతించండి. అంత వుద్రేకం పనికిరాదు.

ఏడు : యింకెన్నాళ్ళు సహించమంటావ్ ?

తలుపు చప్పుడు.

ఏడు : (ఆదుర్దాగా) ఎవరది? (అని కత్తి తీసుకుంటాడు)

పున్న: నేనే! (అని లోనికివచ్చి) మీకోసం ఎవరో యిద్దరు పెద్దమనుషులు-బెజవాడంట - వచ్చారు.

ఏడు : రమ్మను. లోపలికి రమ్మను. (పున్నయ్య Exit) కామాక్షీ! నువ్వు లోనికెళ్లు కాసేపు. (కామాక్షి లోనికి పోతోంది.)

ప్రవేశం గోపాలరావు, తిరువెంగడం. ఇద్దరూ సమాన వయస్కులే. 50 దాదాపు వయస్సు. గోపాలరావు కొంచెం ఠీవిగా వుంటాడు. తిరువెంగడం కొంచెం శ్రోత్రియంగా వుంటాడు.....................

తిరు : అయ్యా! ఇది... తమరు......

ఏడు : ఆఁ. ఆఁ. ఏడుకొండలు అంటే నేనే—రండి. రండి.

తిరు : పొరపాటు పడ్డట్టున్నాం — క్షమించండి. ఇక్కడ నాటకాలు వేసే...

ఏడు : ఆఁ. మేమేలెండి—

తిరు : కామాక్షిగా రుండే గది...

వేదు : ఆఁ. యిదేలెండి. నేను కామాక్షి మొగుణ్నేలెండి.

తిరు : ఓ. అలాగా ! (అతి సంతోషంతో గోపాలరావును ముందుకు రమ్మని సైగచేస్తాడు.)

వేదు : రండి, కూర్చోండి. ఏం పనిమీద వచ్చారు?

తిరువెంగడం, గోపాలరావు కూర్చుంటారు.

తిరు : అయ్యా ; వీరి పేరు గోపాలరావుగారని – బెజవాడలో పెద్ద లఘౌధికారి. గౌరవబెంచి మేజిస్ట్రేటు. నా పేరు తిరువెంగడం. వీరికి కాబోయే వియ్యంకుడిని.

వేదు : అంటే...

తిరు : అంటే వారి అబ్బాయికి మా అమ్మాయిని యివ్వబోతున్నాం.

వేదు : ఓహోహో ! శుభం ! అయితే ఆ పెళ్ళిసందర్భంలో మా నాటకమేదైనా ప్రదర్శించాలని...

తిరు : ఎబ్బెబ్బె... వీరి కుమారుడికి-అంటే నాకు కాబోయే అల్లుడన్నమాట – ఆయనకి నాటకాలంటే మహా పిచ్చి !

వేదు : నాటకాలు చూడడమేనా, లేక వేషాలు వెయ్యటం కూడానా ?

గోపా: అంతతో ఆగినా బాగానే వుండును.

తిరు : మొన్న మీరు బెజవాడలో నాటకం వేశారు...

వేదు : అవును. 'జాంబవతీ పరిణయం'—మీరు చూశారా? (గోపాలరావుతో)

గోపా: నేనా ? (కోపంగా)

తిరు : వారు అసలు నాటకాలు చూడరులెండి. వారి అబ్బాయిగారు చూశారట.

ఏడు : ఎలా వుందన్నారు ?

తిరు : నాటకం ఎలావున్నా ...

గోపా: అందులో నటీమణి అత్యద్భుంగా వుందట.

ఏడు : (సంతోషంతో) నిజంగానా ? ఆవిడేనండి కామాక్షి. ఆవిడ మొగుణ్నే నేను.

గోపా: (తిరువెంగడంతో) ఏమిటయ్యా యీ నానుడు బేరం, వచ్చిన పనేదో త్వరగా తేల్చుకోక.

తిరు : అయ్యా, మే మొచ్చిన పని తమరితో విన్నవించు కుంటాను.

ఏడు : చెప్పండి. నాకు చేతనయిన సహాయం తప్పకుండా చేస్తాను.

తిరు : మొన్న మీ నాటకం చూచిన దగ్గరనుంచి వీరి అబ్బాయికి ...

ఏడు : అంటే ...

తిరు : నాకు కాబోయే అల్లుడుగారికి — కొంచెం మతి భ్రమించింది. ఎవరితోనూ పలకడు. ఎప్పుడూ ఏదో గొణుక్కుంటూ, తనలో తాను పిచ్చి పిచ్చిగా నవ్వు కుంటాడు.

ఏడు : ఏమండి, మీరు పొరబడ్డారేమో ! అది పిచ్చి

గాదండి. కొత్తగా కలిగిన భక్తికికూడ లక్షణాలు అలాగే వుంటాయ్.

గోపా: (వెక్కిరింపుగా) ఎవరిమీద భక్తి?

ఏడు : ఆ శ్రీకృష్ణపరమాత్మమీద.

గోపా: కాదు మీ ఆవిడమీద.

ఏడు : ఎవరు-కామాక్షిమీద, భక్తా?

గోపా: భక్తిగాదు... ప్రేమ!—

ఏడు : ఏమండోయ్! మీరు కొంచెం జాగ్రత్తగా...

గోపా: (తిరువెంగడంతో) ఏమిటయ్యా నీళ్ళు నములుతావు, అసలు సంగతి చెప్పక.

తిరు : (గుటకలు మింగుతూ) మీ నాటకం చూచిన దగ్గర నుంచీ వీరి అబ్బాయికి మీ భార్యమీద ప్రేమ కలిగింది.

ఏడు : ఆఁ! ఏమిటి!

తిరు : కోప్పడకండి. అలా ప్రేమించడం తప్పనే మేమూ అనేది. ఏదో కుర్రవాడు మొండిపట్టు పట్టుకుని కూర్చు న్నాడు. ఎలాగయినా మీరు కొంచెం సహాయం చెయ్యాలి.

ఏడు : సహాయమా! అంటే?

తిరు : మీరలా కంగారు పడకండి. యిందులో మీ అభి ప్రాయం మా అభిప్రాయం ఒకటే, ఒకళ్ళని ఒకళ్లు అర్థం చేసుకోలేకపోతున్నాం గాని...

ఏడు : అయితే మీ రనే దేమిటి?

తిరు : మీరు శాంతించండి కొంచెం. ఏమీ లేదు — ఆ అబ్బాయికి మీ ఆవిడమీదనుంచి ఎలాగయినా మనసు మళ్ళించివేస్తే - వెంటనే మా అమ్మాయిని ఇచ్చి పెళ్ళి చేసేద్దామని.

ఏడు : హుఁ. (అని తలపంకించి ఏదో ఆలోచిస్తూంటాడు.)

తిరు : ఎంతసేపూ మీ ఆవిడగోడవేగాని, మా అమ్మాయి పేరెత్తితే మండిపడుతున్నారు. ఎంత జెప్పినా విని పించుకోందే?—ఇప్పు డక్కడనుంచే వస్తున్నాం.

ఏడు : యిప్పు డాయన ఎక్కడున్నాడు ?

తిరు : ఇప్పుడేమిటి? మీ నాటకంఅయిన దగ్గర్నుంచి మీ వెంటే తిరుగుతున్నాడు. మేము అంతుదొరక్క వెతుక్కుంటూవచ్చి ఈవూళ్ళో పట్టుకున్నాం. యీ వీధి చివరి హోటల్లో గదిలో వున్నాడు.

ఏడు : అయితే ఒక పనిచేస్తారూ!

తిరు : ఏమిటి?

ఏడు . మీరు వెంటనే బెజవాడ వెళ్లి సాయంత్రం బండిలో మీ అమ్మాయిని యిక్కడికి తీసుకురండి.

తిరు : ఎందుకు?

ఏడు : రాత్రికి నాటకం వుందిగా! ఆ నాటకంలో ఆమె చేత జాంబవతి వేషం వేయిద్దాం.

గోపా: ఆఁ (కోపంగా) ఏమన్నావ్ (అని లేస్తాడు)

తిరు : మీరుండండి బావగారూ (అని గోపాలరావును కూర్చోబెడతాడు - ఏడుకొండలుతో)—అలా నాటకాల్లో వేషాలు వెయ్యడం మాబోటి మర్యాదస్థులకి లాకీగాదు నాయనా.

ఏడు : వ్రతంజెడ్డా ఫలం దక్కుతుంది. ఒక్కరోజు భాగోతం. కాస్త కళ్లు మూసుకుంటే—మీ అమ్మాయికి పెళ్లీ అవుతుంది- మీ అల్లుడి పిచ్చి కుదురుతుంది.

గోపా: ఎందుకయ్యా అనవసరపు ప్రసంగాలు. అసలు సంగతి సూటిగా చెబుతున్నా విను. మావాడు కాసేపట్లో మీ ఆవిడవద్దకు రావడానికి సిద్ధంగా వున్నాడు. వద్దని మేమెన్ని చెప్పినా వినేట్టు లేదు. కాబట్టి, వాడు రాగానే, మీ ఆవిడ వాడికి అసహ్యం కలిగేటట్లు ప్రవర్తించి మళ్ళీ యీగడప తొక్కకుండా చేయాలి. ఇదీ నువ్వు చేయవలసిన పని. కాణాలంటే - పది రూపాయలు తీసుకో. (అని పది రూపాయల నోటు తీసి మీదవేసి) అంతే!

ఏడు : (కోపాన్ని దిగమింగి, పది రూపాయల నోటు మెల్లగా తీసుకుంటూ) అంత మదపిచ్చి యెక్కువున్న మనిషి మాటలతో అంత తేలిగ్గా పోతా డంటారా?

గోపా: నువ్వేం మొగపుటక పుట్టలేదటయ్యా! పరాయి మొగాడెవడో నీ పెళ్లాం వెంటబడుతుంటే... నీళ్లు నములుతావే...

ఏడు : నీళ్లు నమలటం గాదండీ - మాటలతో పొమ్మంటే పోతాడా అని.

గోపా: పోకపోతే, తెచ్చి యింట్లో పెట్టుకుంటావా ?

ఏడు : ఎబ్బే !

గోపా: మరి ఏం జేస్తావ్ ?

ఏడు : తంతాను. (తీవ్రంగా)

గోపా: }
తిరు : } ఆఁ.

ఏడు : నడుము విరగదన్ని బయటికి గెంటుతాను.

తిరు : ఎందుకండీ. తన్నుల్దాకా ఎందుకండి. అతను చాలా మెత్తని మనిషి. ఒక్కమాటంటే వెనక్కు వెళ్ళిపోతాడు.

ఏడు : మళ్ళీ యెక్కడా యిటువంటి పనులు జెయ్యకుండా ఏ కాలో చెయ్యో విరగ్గొట్టి మరీ పంపిస్తా !— పొండి, యిక పొండి. మీరొచ్చిన పని అయిందిగా?

తిరు : (జంకుతో) నే చెప్పేది... ......

ఏడు : నువ్వు చెప్పినట్టే చేస్తాను. మళ్ళీ యీ గడప తొక్కకుండా చేస్తాను. కాని మాకేం అంచం అక్కర్లా. యిదుగో నీ డబ్బు! ఎంత గడ్డిదిని గడించావో పాపం ! (అని నోటు గోపాలరావు మొఖాన గొడతాడు.) .

గోపా: (కోపంతో) ఏంరా ! నీ పొగరు.

ఏడు: నోరెత్తావంటే పళ్ళు రాల్తాయ్ (అని మీదికిపోతాడు)

గోపా: ఏం, కొడతావా !

వడు : ఏం, ఏం జేస్తావ్ (అని తెంపకాయ కొడతాడు )

తిరు : (హడావుడిగా) ఆc. తప్పు, తప్పు, పెద్దలు పెద్దలు-

వడు : పొండి బయటికి. (కామాక్షి హడావుడిగా లోప
ల్నుంచి 'ఏమిటండీ ఏమిటండీ' అంటూ వస్తుంది.)
ఊc. (గోపాలరావు, తిరువెంగడం బయటికి పారి
పోతారు.) (Pause)

కామాక్షి: ఏమిటండీ; ఏం జరిగింది ?

వడు : వెధవలు, పెద్ద మనుషులంట పైగా !

కామాక్షి: ఏమన్నారు !

వడు : నాటకాల వాళ్ళంటే అందరికీ చులకనే !

కామాక్షి: అసలు సంగతేమిటండీ ?

వడు : అతగాడి కొడుకు బెజవాడలో మన నాటకం చూశా
డట. అప్పటినుంచి వాడికి నీమీద ప్రేమ కలి
గిందట - ప్రేమ ! వెధవకి.

కామాక్షి: అయితే వాళ్ళనేదేమిటి ?

వడు : వాడికట ప్రేమతో పిచ్చెక్కిందట. కాసేపట్లో
యిక్కడికి వస్తాట్ట. అప్పుడు మనం మెత్తగా చివాట్లు
పెట్టి వాణ్ణి ఎలాగైనా యింటికి పంపించెయ్యాలట.

కామాక్షి: అందుకు మీరేమన్నారు ?

వడు : ఏమన్నానా ? నా వాకిట్లో కొస్తే కాళ్లు విరగ్గొట్టి
మరీ బయటికి గెంటుతా నన్నా !

కామాక్షి (బయటికి చూస్తూ) రానియ్యండి. వెధవకి బాగా బుద్ధి చెప్పి పంపుదాం !

బయటినుంచి పున్నయ్యంగొంతు 'ఏమండీ' అని.

ఏడు : ఎవరది ?

పున్న : (బయట్నుంచే) మీకోసం ఎవరో వచ్చారు.

ఏడు : అదుగో. వాడే అయ్యుంటాడు. నువ్వు తలాగిలా చెరుపుకుని, తాగిందానిలాగా మాట్లాడు. నే నీ తలుపు చాటున వుంటా (అని ప్రక్కనే దాక్కుం టాడు)

కామాక్షి: రమ్మనండి పున్నయ్యగారూ ! (తల చెరుపుకుని కూర్చుంటుంది.)

ప్రవేశం ఒక వ్యక్తి.

వ్యక్తి: నమస్కారమండి. తమరు...

కామాక్షి: (ఎక్కిళ్లు వస్తయ్) ఆఁ. నేనే. (అని క్రీగంట చూస్తుంది.)

వ్యక్తి: (ఆమె వైఖరి చూచి కొంచెం ఆశ్చర్యం) క్షమిం చండి. తమరు...

కామాక్షి: నేనేనంటే (తాగినట్టు మత్తుగా మాట్లాడుతుంది.)

వ్యక్తి: మీ పేరు కా...మా...క్షి...

కామాక్షి: అవును. నాపేరు - కామాక్షి - అభినవ మంకి- బ్రాండు. (అని వికటంగా నవ్వి లేచి, నిలబడుతుంది)

వ్యక్తి: ఆఁ. రాత్రి మీ నాటకం చూచాను. ఆశే డబ్బురాక పోయినా...

కామాక్షి: ఆఁ, డబ్బు దేముంది. వెధవ డబ్బు. మీలాటి వారు మెచ్చుకోవాలిగాని... (వికారంగా నవ్వుతూ దగ్గర కొస్తుంది) ఒంటరిగా ఉన్నానని, చూచి వచ్చినట్టున్నారే.

వ్యక్తి: (వెనక్కి జంకుతూ ఏదో అనబోతాడు)

కామాక్షి: నీకు నాలాంటి అక్కలూ, చెల్లెళ్లూ లేరూ! పరాయి ఆడవాళ్ళంటే పారేసి వున్నారనుకున్నావా?

వ్యక్తి: మీరు పొరబడుతున్నారు - నేను...

కామాక్షి: పొరబాటేమీ లేదు - నీ మొఖమే చెబుతోంది.

వ్యక్తి: ఛీ, మీరు తాగి, ఒళ్లు తెలీకుండా మాట్లాడుతున్నారు.

కామాక్షి: నేను తాగితే ఎంతో, నువ్వు తాగకపోయినా అంతే!

వ్యక్తి: ఏయ్, నిన్ను చూచి ఏమిటో అనుకున్నాను. ఇంత నీచురాలి వనుకోలేదు. స్త్రీ లోకాని కంతకూ, ముఖ్యంగా నటలోకానికి తీరని కళంకం తెస్తున్నావు. నీలాటి వాళ్లుండబట్టే...

ఏడు : (తలుపు చాటునుంచి వచ్చి, చొక్కా చేతులు పైకి తీస్తూ) ఏమిట్రా నీతులు చెబుతున్నావ్? (అతని మీదికి వస్తాడు)

వ్యక్తి: నీకు సిగ్గు లేదూ?

ఏడు : నాకా? నాకట్రా సిగ్గు! (అని మొఖాన ఒకదెబ్బ కొడతాడు. వ్యక్తి ప్రక్క బల్లమీద పడతాడు.

ఏడుకొండలు అతన్ని మళ్ళీ లేపి, అతని చొక్కా-పట్టుకుని, గట్టిగా మొఖాన కొడతాడు. ఆ దెబ్బతో వ్యక్తి వాకిలి అవతల పడతాడు)

ఏడు: : వెధవ! మళ్ళీ జన్మలో యిలాటి పని చెయ్యడు.

కామాక్షి: (జాలిగా)అసలే, చాలా మెతకసన్యాసిలాగున్నాడండీ!

ఏడు : మెతక - యీ దెబ్బతోజావయిపోయాడు. -(కామాక్షితో) వాడిప్పుడు తిన్నగా ఎక్కడి కెళతాడో చెప్పు!

కామాక్షి: ఏమో నాకేం తెలుసు?

ఏడు : పళ్ల ఆసుపత్రికి పోతాడు——దెబ్బతో పళ్లన్నీ కదిలి పోతే - వెధవకి!

ప్రవేశం: పున్నయ్య.

పున్న: నేను చెప్పలా! మీ కష్టం వృధాగాపోదని - మా వూళ్లో నాటకమేసి నష్టంతో బయటికి పోవడమే!

ఏడు : ఏమిటి గోల!

పున్న: ఆ కృష్ణపరమాత్మే మిమ్మల్ని కనికరించాడు. ఏ మాత్రం యిచ్చాడేమిటి?

ఏడు : వాడిచ్చేదేమిటి - నేనే యిచ్చాను వాడికి - దవడ పళ్లు రాలేట్టు!

కామాక్షి: యీ దెబ్బతో మళ్ళీ మా గడప తొక్కడు.

పున్న: ఏమయ్యోయ్, నీబోటి వాళ్ళని చాలా మందిని చూచాను. నా దగ్గరే నాటక మాడుతున్నావ్?

ఏడు : నాటక మేమిటయ్యా — యింకొంచెం ముందొస్తే సర్కస్సే చూపించేవాణ్ణి!

పున్న: నాకు నాలుగోవంతు మామూలే! నాది నాకిచ్చెయ్యండి.

ఏడు: నాలుగో వంతేమిటి ?

పున్న: నిన్నేం కొత్తగా అడగటల్లేదు లేవయ్యా. మిగతా నాటకాల వాళ్లని గూడా విచారించు కావాలంటే.

ఏడుకొండలు, కామాక్షి కొంత అనుమా నిస్తారు – పున్నయ్య ధోరణి చూచి.

ఏడు : ఏమిటి పున్నయ్యా! నువ్వనేది ?. 4వ వంతు భాగ మేమిటి ?

పున్న: యిప్పుడు వచ్చిన వాణీ ప్రసాద్‌గారు మీకు యిచ్చిన విరాళంలో నాకు 4వ వంతు మామూలు.

ఏడు : వాణీ ప్రసాద్ ఎవరు ?

పున్న: యిప్పుడు వచ్చినాయనే! మీరు అడిగినా ఆయన చెప్పడు లే పేరు. చేసే సహాయ మేమిటో రహస్యంగా చేసిపోతాడు.

యిద్దరూ విస్తుపోతారు.

ఏడు : ఎవరు ఆయన ?

పున్న: ఆయన యీవూళ్లో లక్షాధికారి, యువకుడు. నాటకాలంటే మహాసరదా. యీవూళ్లో ఏ నాటకానికయినా నష్టం వచ్చిందంటే - వాళ్ల కష్టసుఖాలు విచారించి, రెండోకంటివాడికి తెలీకుండా, వందో యాభై యో

చేతిలో పెట్టి పోతుంటారు. ఇది మామూలుగా జరిగేదే.

ఏడు : ఆఁ, నిజంగానా ?

పున్న: నిజంగానా ! మీ కెంతయిచ్చాడు?

ఏడు : ఎంతపని జరిగింది కామాక్షీ ! మన నోట్లో మనమే దుమ్ము కొట్టుకున్నాం కామాక్షీ (అని యేడుపు మొహం పెడతాడు.)

కామాక్షి: అయ్యో ! (అని యేడుస్తుంది)

పున్న: (నమ్మ్మతాడు) ఏం జరిగింది. ఆయన డబ్బివ్వలా ?

ఏడు : ఆయన డబ్బిచ్చిందాకా ఎక్కడుంది పున్నయ్యా ! వచ్చీ రావడంతోనే తిట్లకి తగులుకొని – దవడ పళ్లు రాలగొట్టి పంపించాను పున్నయ్యా !

పున్న: కొట్టడం దేనికి ?

ఏడు : (కూలబడి) నే జెప్పలేను — నువ్వన్నా చెప్పవే కామాక్షీ !

పున్న: ఏమిటమ్మా ! ఏం జరిగింది ?

కామాక్షి: బెజవాడనుంచి ఎవడో వెధవ నన్ను ప్రేమించి పిచ్చెక్కి చస్తున్నాడంట. వా డొస్తాడని తెలిసింది యింతకు ముందుగానే; యింకేముంది – యీయన రాగానే—వాడే అనుకుని – అమాంతం పైనబడి

కొట్టి జైటికి గెంటాను పున్నయ్యగారూ! (ఏడు కొండల్ని కావిలించుకొని యిద్దరూ ఏడుస్తారు)

పున్న: అయ్యో! ఎంతపని జరిగింది.

ఏడు : ఆత్మహత్యకన్నా అన్యాయమయి పోయింది కామాక్షీ! (అని తకీమని ఆపి) ఆ, వుండు. అయి పోయిందానికి ఏడిస్తే ఏం ప్రయోజనంగాని - వుండు యీ ఫీలింగ్సుతో ఆత్మహత్య రిహార్సలు వేస్తే, అద్భుతంగా వుంటుంది. (అని కామాక్షిని అవతలకు నెట్టి, బల్లమీద కత్తితీసి, ఆత్మహత్య రిహార్సలుకు ఉపక్రమిస్తాడు. కామాక్షితో) నువ్వు దూరంగా వుండు. నే పడిపోయింతర్వాత రా. (కామాక్షి దూరంగా వెడుతుంది - పున్నయ్య చూస్తూ నుంచుంటాడు.)

ఏడుకొండలు కత్తి గుండెకు చూపుకుంటూ, కళ్లు మిటకరించి, భయంతో వూగిపోతూ - గుండెల్లో పొడుచుకుంటాడు. పొడుచుకోకముందేపడిపోతాడు.

కామాక్షి: హా! ప్రాణనాధా (అని రాబోతుంది)

ఏడు : ఆహాఁ. ఆగు. ఆగు. పొడుచుకోకముందే పడి పోయాను. (అని లేచి మళ్ళీ మొదలుబెట్టి పొడుచు కుని క్రిందపడిపోతాడు)

కామాక్షి: రైటేనా?

ఏడు : రైట్, రైట్.

కామాక్షి: హా! ప్రాణనాథా! (అని అతనిమీద పడిపోతుంది.)

పున్న: (ముందుకివంగి, అదేపనిగా చూచి) నే వెళ్ళివస్తా ఏడుకొండలూ!

ఏడు :<br>కామాక్షి : } మంచిది. వెళ్ళిరా, పున్నయ్యా!

పున్నయ్య వెడుతుండగా తెరపడుతుంది.



## పాత్రలు :

సీతమ్మ

రమణయ్య

శేఖరం

పూజారి

పెదబాబు

డాక్టరు

గుమాస్తా

# స్వర్గసీమ

రమణయ్యగారి ఇల్లు. ఉదయం 7 గll

రమణయ్య: (త్రేన్చుకుంటూ) శేఖరానికి బొత్తిగా మతి పోతోంది. రోజురోజుకీ వంట అధ్వాన్నంగా చేస్తున్నాడు.

సీతమ్మ: ఏమండీ! ఇవాళ యిడ్డెన్లు బాగాలేవా? అరడజనుతోనే ముగించారేం?

రమ : (కోపంగా) ఎట్లా తగలడ్డయ్యో కొంచెం తినిచూడు తెలుస్తుంది! ఝల్లుగా నాలుక కోరికేస్తున్నయ్. పిండి పూర్తిగా పులవబెట్టేశాడు. వాడికి అసలు ఒళ్లు దగ్గరుంటేగా! చెప్పిచేయించే ఓపిక నీకూ లేదు.

సీత : అదేమిటండీ! నన్నంటారు. ఒరేయ్ శేఖరం!

శేఖ : (లోపల్నుంచి) అమ్మా!

సీత : ఏమిట్రా? ఇడ్డెన్లు యిహ్వాళ......

శేఖ : పిండి కొంచెం యెక్కువగా పులిసిందమ్మా.

రమ : (బిగ్గరగా) ఆ సంగతి తిన్నవాళ్ళకి తెలుస్తూనే వుందోయ్. అంత ఒళ్ళు దగ్గరలేకుండా యెందుకు పులవబెట్టావని?

శేఖ : (జంకుతూ) పులిసింది బాబూ!

రమ : అరె! మళ్ళీ అదేమాటంటావూ...

సీత : సరేగాని! వెళ్ళి నాలుగు చక్కరకేళీలన్నా తెచ్చి యివ్వు! బొత్తిగా యేమీ పుచ్చుకోకుండానే లేచారు.

శేఖ : చిత్తం.

రవి : ఇవ్వాళ యిడ్లెన్లు బలే బాగున్నాయే అమ్మా.

రమ : (కోపంగా) ఏడిశావ్!

రవి : నిజంగా నాన్నా! పుల్లగా ఎంత బాగున్నాయను కున్నావ్.

శేఖ : ఇవిగోను బాబూ చక్కరకేళీ పళ్ళు.

రమ : ఆ బల్లమీద పెట్టి వెళ్ళు.

సీత: కూర్చొని పుచ్చుకోండి.

రమ : ఇవ్వాళ ఆఫీసుకి కొంచెం తొందరగా వెళ్ళాలి. వంట త్వరగా చేయించు — శేఖరం, వినబడుతోందా చెప్పేది?

శేఖ : చిత్తం బాబూ!

రమ : ఇవ్వాళ ఆ దొరగారేరీ—పొద్దుపొడిచేసరికే ఎక్క డికో దయచేశారు!

సీత : ఏమోనండి! నేనే కొంచెం ఆలస్యంగా నిద్రలేచాను. నేను లేచేసరికే లేడు. ఏరా శేఖరం? పెదబాబు యెక్కడి కెళ్లాడు?

శేఖ : ఇవ్వాళ 6 గంటలకే ఫలారం పుచ్చుకుని, బ్యాటు తీసుకుని, సైకిలెక్కి బయటి కెళ్లారమ్మా!

రమ : వీడికి ఆటలరంధి యెక్కువవుతోంది. చదువు సన్న గిల్లుతోంది. కాలేజీకి బహు జోరుగా ఎగ్గొడు తున్నాట్ట. వీడిసంగతేమిటో కనుక్కోవాలి.

సీత : పోనిద్దురూ చిన్నతనం.

రమ : ఎల్లకాలం చిన్నతనమే-నెత్తినెక్కించుకో-గారాబాల పట్టిని.

సీత : ఎక్కడికండీ ప్రయాణం?

రమ : అలా బజారుకెళ్ళొస్తా. చుట్టలూ అవీ కొనుక్కు రావాలి. ఇప్పుడేవస్తా మళ్ళీ.

రవి : అమ్మా! నేగూడపోతానే-బిస్కట్లు తెచ్చుకుంటా!

సీత : పిణ్ణిగూడానట తీసుకెళ్ళండి.

రమ : రారా! పోదాం. ... ...ఆఁ ఆ కండువా యిటివ్వు. (పోతారు.)

సీత : (గట్టిగా) ఏమండీ! వక్కపొడికూడా అయిపోయింది. ఒక పాకెట్ పట్టుకురండి...ఒరే శేఖరం!

శేఖ : అమ్మా!

సీత : వంట త్వరగా కానియ్ ... ... ఆమ్లెట్లువేసి పెరుగు పచ్చడి చేసెయ్...బంగాళాదుంపలు వేపుడుకూడా చేసెయ్. సాంబారు-రసం పెరుగూ-పండ్లు చాల్లే.

శేఖ : అలాగేనమ్మా.

పూజారి: నమస్కారమండి - సీతమ్మగారూ.

సీత : ఓ! పూజారిగారా! దయచేయండి. ఏం పొద్దున్నే వచ్చారు!

పూజా: (వెకిలిగా నవ్వుతూ) రమణయ్యగారు యిప్పుడే బైటికెళ్ళినట్లున్నారు.

సీత : అవునండి. ఇప్పుడే బజారుకేసి వెళ్ళారు. మీకు యెదురయినారా!

పూజా: ఆహాఁ. వారు అలా ఆ రోడ్డుమలుపు తిరిగారు. నేను యిలా యీ వీధినెంటవచ్చాను. నేను వారిని చూశానుగాని, వారు నన్ను చూడలేదు.

సీత : ఏం! నాలుగు రోజుల్నుంచి బొత్తిగా యింటివేపు రావడమే మానేశారు?

పూజా: (వెకిలిగా) మీకు తెలియందేముందమ్మా! అదే! ఆ దేవాలయం పనిలోనే – చందాలకోసం తిరుగుతున్నాను.

సీత : శేఖరం! పూజారిగారికి నాలుగు పండ్లు తెచ్చియివ్వు కాఫీ పుచ్చుకుంటారా?

పూజా: అబ్బే! ఎందుకండి పాలుచాలు.

సీత : ఒక కప్పు పాలుకూడా పట్రారా శేఖరం?

శేఖ : చిత్తం.

సీత : వసూళ్ళు బాగా అవుతున్నాయా అండీ!

పూజా: ఏదో మీ దయవల్ల ... అవుతూనే వున్నాయండి. (లౌక్యంగా) ... ఆఁ. రమణయ్యగారితో చెప్పారా చందా సంగతి!

సీత : లేదండి! వారు ఒకరకం మనిషి. పైగా యిలాటి దేవాలయాలు, దేవుళ్లు అంటే మండిపడతారు___

అయినా మండిపడతారని వూరుకుంటే యెలాలెండి. ఏదో సమయంచూసి, నచ్చచెప్పి నేనేదో యేర్పాటు చేయిస్తాగా!

పూజా: అలాగేలెండి! నాకు గట్టి ధైర్యంవుంది మీరు చెప్పి వొప్పించగలరని!

శేఖ : ఇవుగోనమ్మా పండ్లు, పాలు.

సీత : పుచ్చుకోండి, పూజారిగారూ!

పూజా: శ్రీ వెంకటేశ్వరార్పణం – అరుగో రమణయ్యగా రనుకుంటాను, వస్తున్నారు.

సీత : అవును వారే! త్వరగా ఆఫీసుకు వెళ్ళాలట యివ్వాళ...

పూజా: నమస్కారమండి, రమణయ్యగారూ!

రమ : (విసుగ్గా) ఊం. నమస్కారం. ఏమే! వంట యిందా?

సీత : అవుతోందిలెండి. ఇంకా టైముందిగా.

రవి : అమ్మా! నేను బిస్కట్లు తెచ్చుకున్నా!

సీత : స్నానానికి నీళ్ళు కాగుతున్నాయ్, కాసేపు కూర్చోండి... ...ఆం. ఇప్పుడే పూజారిగారు చెబుతున్నారు మనవూళ్ళో కొత్తదేవాలయాన్ని గురించి.

రమ : (ఆశ్చర్యంగా) ఏమిటి కొత్త...?

సీత : దేవాలయమండి!

రమ : (కోపంగా) దేవాలయమా?

పూజా: చిత్తం.

రమ : ఏం! ఇదివరకున్నయ్ చాలకనా?

పూజా: అహాఁహాఁ. ఇది వెంకటేశ్వరస్వామి వారికి ఆలయమండి, ప్రపంచంలోకల్లా స్వామివారికి యిదివరలో ఒక్కతిరుమల తిరుపతిలోనే ఆలయముంది, మన వూళ్ళో గూడా మరొకటి యేర్పాటు చేద్దామని.

రమ : అక్కడ ఆయనకి రష్ యెక్కువగా వుందని-యిక్కడ మరొక బ్రాంచ్ యేర్పాటు చేస్తున్నారన్నమాట.

సీత : మీదంతా వేళాకోళమండి. అనేమాట, అనగూడని మాటగూడా తెలీదు.

పూజా. ఆలయానికి చాలా ఖర్చవుతుందండి. తగు అంచనాలు వేయించి భారీయెత్తునే చందాలు వసూలు చేస్తున్నామండి.

సీత : మీరు పూనుకుంటే డబ్బుకేం కొదవండి. పూజారిగారూ! అందులో స్వామివారి కార్యంగాని— మీ యింట్లో పెళ్ళి కాదుగా!

రమ : (ప్రమాదం గ్రహించి) ఇదిగో, ఈ దేవుళ్ళన్నా, దేవాలయాలన్నా నాకు బొత్తిగా సరిపడదు. అందులో డబ్బుకు కటువుగా వున్న యీ రోజుల్లో యింతంత డబ్బుబోసి దేవాలయాలా? అర్థంలేదు. వ్యాపారాలు యెలా యేడుస్తున్నయ్యో తెలుసా? దమ్మిడీ పుట్టడంలేదు. మా మట్టుకు మా కంపెనీకి యీ సంవత్సరం 20 వేలు నష్టం.

సీత : అదేమిటండి. మొన్ననేగా 60 వేలు లాభమని చెప్పారు.

రమ : (కోపంగా) ఇదిగో! ఇది రూపాయి అణాల సంగతి. నీకు అర్థంకాదు. నీ వూరుకో. క్రిందటి సంవత్సరం 80 వేలు లాభం వచ్చింది. యీ సంవత్సరం 60 వేలే వచ్చింది. ఆ లెఖ్ఖన మరి 20 వేలు నష్టం కాదూ!

పూజా: (నవ్వుతూ) తమరలా సెలవిస్తే యెలా? చెప్పండి.

సీత : వారి మాటలకేంలెండి? లాభాలదేముంది — ఆ స్వామివారి దయ వుండాలిగాని.

రమ : స్వామివారి దయ! పోనీ అ స్వామివారినే యేటా ఒక లక్షరూపాయల లాభం గ్యారంటీ యివ్వమను! అలాగే ఒకవెయ్యి చందా పారేద్దాం.

పూజా: తమ చందా మొత్తం యిదివరకే నిర్ణయించబడింది లెండి!

రమ : ఎవరా నిర్ణయించింది?

పూజా: వారి వారి తాహతుబట్టి, ఎవరెవరెంత యివ్వాలో ఆలోచించే నిర్ణయించాంలెండి.

సీత ; మన తోటివాళ్ళంతా వెయ్యిన్నూట పదహార్లు ఇస్తుంటే-మనం అంతకంటే తక్కువ ఇస్తే యేం బాగుంటుంది! చెప్పండి.

రమ : (ఆశ్చర్యంతో) వెయ్యిన్నూట పదహార్లే! ఇదిదోపిడి! పట్టపగలే పచ్చి దోపిడి! వ్యాపారంచేసి సంపాయించిన

సామ్మనుకున్నారా ? కన్నా లేసి దోచు కొచ్చామను కున్నారా ? లేక నోట్లు ముద్రవేశామనుకున్నారా ?

సీత : ఏమిటండీ ? పుణ్యకార్యానికి గూడా అట్లా మాట్లాడ తారు. పోయేటప్పుడు కట్టుకుపోతామా ? తరతరాలు మనపేరు శాశ్వతంగా వుంటుంది. నేనైతేనా ఆలయ మంతా నేనొక్కదాన్నే కట్టించేదాన్ని.

రమ : కట్టిద్దువుగాని లే, తొందరపడకు.

సీత : లేకపోతే యేమిటండీ—అందరూ కలసి అంత పుణ్య కార్యం తలపెట్టి చేస్తుంటే—మనమూ ఒకచెయ్యేసి అవునని పించుకోంటారా ? కాదని నలుగురిలో నవ్వుల పాలవుతారా ?

రమ : అయితే, పూజారిగారూ ? చందాలు యెంతవరకు వసూలయ్యాయి !

పూజా: (సంతోషంతో) అయ్యా! వెయ్యేన్నూట పదహార్ల పద్దులు యిప్పటికి పది. ఇంకా పది తప్పకుండా వస్తయ్. ఇక 500 పద్దులు ఒక యిరవై. సరే నూట పదహార్లు ఒక వందకుపైగా వున్నయ్.

రమ : ఇవన్నీ వాగ్దానాలేనా—లేక రొఖ్ఖం...

పూజా: వాగ్దానాలే అనుకోండి. అయినా అంతా ఘరానా మనుషులు, పని మొదలుపెట్టడంతోటే ఖచ్చితంగా వసూలవుతయ్ ఏమీ సందేహం లేదు.

సీత : అందులో స్వామివారి కార్యం ఇస్తానని మళ్ళీ కాదన డానికి యెవరికి గుండెలుంటయ్ ?

రమ : అయితే-ఇంత డబ్బుబోసి కడుతున్నారుగదా, రేపు దీనిమీద వచ్చే ఆదాయం యేంజేస్తారు? దానికి లెక్కా డొక్కా వుంటుందా?

పూజా: మీరంతా యెలా అనుకుంటే అలాగ, కమిటీ వుంటుందిగా! వెయ్యినూటపదహార్లిచ్చిన వారంతా కమిటీ సభ్యులే! వారిదే. పెత్తనం అంతా!

రమ : అలావుండాలి. వంజా, యాభై కాదు, వేలు లక్షలు వస్తయ్ ఆదాయం! అందులో వెంకటేశ్వరస్వామి వారంటే ఆలిండియా మొత్తంనుంచి వస్తారు, కాబట్టి మేనేజిమెంటు పకడ్బందీగా వుండాలి.

సీత : ఏమిటండి. ఇదేదో వ్యాపారంలా మాట్లాడతారు. ఇది దేవుడి సొమ్మనుకున్నారా లేక...

రమ : ఇది ఆర్థిక శాస్త్రానికి సంబంధించిన విషయం. నీకు అక్షరంకూడా తెలీదు. నోరు మూసుకొని వూరుకో. పూజారిగారూ నాదీ నలుగురితోపాటు ఒక వెయ్యి నూటపదహార్లు. ఇప్పటికి వాగ్దానం చేసినవాళ్ళంతా ఇచ్చిన తరువాత నా దగ్గరకు రండి.

పూజా: చిత్తం. చిత్తం. అలాగే మీ ఇష్టం.

సీత : (సంతోషంతో) పూజారిగారూ! నే చెప్పలా! ఆ స్వామివారే బుద్ధిపుట్టిస్తాను.

రమ : మా తోటి వ్యాపారస్తులచేతగూడా వేయిస్తానులెండి నాలుగు పద్దులు!

పూజా: (అమితానందంతో) ఓహో! ఓహో! మీకు తల్చుకుంటే లక్షలు పోగుజెయ్యగలరు. చాలా సంతోషం!...అయితే సెలవిప్పించండి. తరువాత దర్శనం చేసుకుంటాను.

రమ :
సీత : } ఆలాగే, వెళ్ళిరండి.

రమ : అలా బయటికెళ్ళొస్తా...(వెళ్తాడు)

రవి : అమ్మా! మనూళ్ళో కొత్త దేవుడిగుడి కట్టిస్తారట.

సీత : అవున్నాయనా! నాన్నగూడ వెయ్యిరూపాయ లిస్తున్నారు.

రవి : ఏం గుడమ్మా! రాములవారి గుడా? ఆంజినీలు గుడా?

సీత : వెంకటేశ్వరస్వామి గుడి నాయనా!

రవి : ఎవరూ? తిరుపతి దేవుడా?

సీత : ఆc.

రవి : ఆయనకి తిరుపతిలో వుండిగా యిక్కడెందుకు?

సీత : దేవుడికి యెన్ని గుళ్ళుంటేమట్టుకు, ఎక్కువేముంది?

రవి : వెంకటేశ్వర్లు దేవుడు రాములవారికేమవుతాడే అమ్మా?

సీత : ఏమవుతాడేమిటి-నీ ముఖం అందరు దేవుళ్ళు ఒకటే!

రవి : ఛో! అందరూ ఒకటికాకేం! ఆంజినీలుకి తోక వుంటుంది. రాములవారు పొడుగ్గా బలే బాగుంటాడు. వెంకటేశ్వర్లు దేవుడు నాన్నగారిలాగా నల్లగా

వుంటాడు. మొఖంనిండా తెల్లగా పంగనామాలూ, గూనీ, ఇంతంత పొడుగు చెప్పులూ......

సీత : చాల్లే నోరుముయ్ ! మహా చూసొచ్చినట్టు !

రవి : సినిమాలో చూశ్శేదమ్మా ! నాన్న నడుగు యింకా అబద్ధమయితే !

సీత : సినిమాలో యేం కర్మం ! రేపు తిరుపతి వెళదాంగా! అక్కడ చూద్దువుగాని.

రవి : నిజంగానా ! ఎప్పుడమ్మా తిరుపతి వెళ్ళేది ?

సీత : నాన్న నడిగి, ఎప్పుడెళదా మంటే అప్పుడు.

రవి : అయితే నాన్న నడుగుతా రేపే తీసుకెళ్ళమని. అదుగో ! నాన్న వస్తున్నాడు. నాన్నా ! తిరుపతి యెప్పుడెళదాం నాన్నా ?

రమ : తిరుపతి !

సీత : అవునండి ! ఇప్పుడే అంటున్నా అబ్బాయితో ! యెప్పు డెళదాం తిరుపతి ?

రమ : (కోపంగా) తిరుపతి లేదు, గిరపతి లేదు.

సీత : ఎప్పుడూ అట్లాగే అంటారు ! ఎలాగండి ?

రమ : ఏం ?

సీత : మొక్కులు తీర్చుకోవద్దూ ! ఎన్నాళ్ళని పేరబెట్టు కుంటాం చెప్పండి !

రమ : మళ్ళీ మొదలెట్టావ్ పాతపాట !

సీత : అలాగాదు ! ఈ సారి తప్పక వెళ్ళాలిసిందే.

రమ : ఆఁ.

సీత : ఎందుకండీ అంత మొండిపట్టు! ఎప్పుడో కాదన్నా రని, ఎప్పుడూ ఆ మాటేనా!

రమ : అంతే! ఒకటేమాట! నాకు రెండు నాలుకలు లేవు!

సీత : 'ఇవ్వను యివ్వను' అని దేవాలయానికి యివ్వలేదే మిటి? అలాగే దీనికీ యెప్పుడో బుద్ధిపుట్టిస్తాడు భగ వంతుడు.

రమ : అదా నీ ఆశ! ఆ పప్పులేం వుడకవ్. దేవాలయానికి భక్తికలిగి యిచ్చాననుకున్నావా?

సీత : భక్తో, భయమో - ఏదయితే యేం; యిచ్చారు. అదేచాలు.

రమ : పిచ్చిదానా! ఈ రమణయ్యకేం మతిపోలేదేవ్! ఒక వేళ అంత కర్మంకాలి వాళ్ళు కట్టిస్తే - ఆ కట్టడం కంట్రాక్టు మనచెయ్యి దాటిపోదుగదా? తరువాత మిగతావాళ్ళ నందరినీ దబాయించి, దేవాలయానికి యేటావచ్చే ఆదాయం వేలాంపాట పెట్టించి, అది మనపేరనో, మనకు అనుకూలమైనవాళ్ల పేరనో కొట్టి వేయించుకుంటాం. ఇన్నిలాభాలేడిశాయ్ అందులో. ఆడదానికి నీకేం తెలుసు.

సీత : అయ్యోరామ! అందులోగూడా వ్యాపారమేనా?

రమ : మీ అన్నయ్యకి యివాళ వుత్తరం రాశాను రమ్మని.

సీత : ఏమిటి పని?

రమ : ఇందాకటినుంచి చెప్పేదేమిటి? దేవాలయం కట్టడా

నికి టెండరు పెట్టించడానికి. ఆ వూళ్ళో కంట్రాక్టు పనులేవీ దొరకడంలేదని గోలపెడుతున్నాడుగా!

సీత : నిజమేనండోయ్! నాకీ వూహా తట్టనేలేదండి! పాపం తప్పకుండా ఆ మాత్రం సాయం చేద్దురూ - పిల్లలు గలవాడు.

పెద : చెలియా కనరావా

ఓ చెలియా కనరావా. (లోసల్నుంచి)

రమ : ఎవరా సంగీతం?

సీత : పెదబాబు వస్తూన్నట్టున్నాడు.

రమ : కాలేజీ ఎగ్గొట్టున్నాడు యివ్వాళ?

పెదబాబు పాడుకొంటూ బూటుతో ప్రవేశిస్తాడు. తండ్రినిచూచి, పాటను ఆపేస్తాడు; తెల్లబోతాడు.

రమ : ఏంరా? ఎక్కడనుంచి రావటం?

పెద : (మాట్లాడకుండా రాకెట్ కదుపుతాడు.)

రమ : ఇవ్వాళ కాలేజీ కెళ్ళావా?

పెద : ఇవాళ సెలవు నాన్నా!

రమ : ఎవరికి సెలవు, నీకా? కాలేజీకా?

పెద : నిజం నాన్నా! మా కాలేజీ కమిటీ ప్రసిడెంటుగారు చచ్చిపోయారని సెలవిచ్చారు.

రమ : నిన్న వెళ్ళావా?... మాట్లాడవేం?

పెద : (జంకుతూ) వెళ్ళలేదు.

రమ : నిన్న యెవడు చచ్చాడు?... ...ఏం?

పెద : నిన్న నాకు ఒంట్లో బాగా లేదు.

సీత : నిజమేనండి. నిన్నంతా అదోమాదిరిగా వున్నాడు. భోజనంగూడా సరిగా చేయలేదు.

రమ : నిన్న బాగోపోతే ప్రొద్దున పొద్దుపొడవకముందే టెన్నిస్ కెలా వెళ్ళావ్ ... మాటాడవేం రా? ... ఇదుగో ఇలాంటి పిచ్చివేషాలు వేశావంటే అడుక్కుతిని పోతావ్ ... అసలు నువ్వు కాలేజీ కెళ్ళి యెన్నాళ్ళయిందిరా?

సీత : అబ్బ! నిన్నా యివాళే కదండీ, ఎందుకలా నిప్పులు కక్కుతారు వాడిమీద?

రమ : నోరుముయ్! వీడు రెండు నెలలనుంచీ కాలేజీ కెళ్ళటం లేదు, తెలుసా! వీళ్ళ ప్రిన్సిపాలు కనపడి చెప్పాడు.

సీత : ఏంరా నాయనా?

పెద : వెళ్ళలేదు.

రమ : ఎందుకని?

పెద : కాలేజీ మానేశాను.

రమ : ఆఁ?

పెద : నే నిక చదువుకోను.

రమ : చదువుకోక, గాడిదలు కాస్తావా?

పెద : ఏదైనా వుద్యోగం చూచుకుంటాను.

రమ : ఆఁ. చాలాదాకా వచ్చిందే వ్యవహారం! సరేపో! ఉద్యోగం చేసి సంపాయించుకొని, తిను. ఇక నీకు దమ్మిడీ యివ్వను నేను. ఇదుగో! నువ్వుగూడా

వీడికి దమ్మిడీ యిచ్చావా జాగ్రత్త! — ఎంత మాత్రం సంపాదిస్తాడో చూస్తా.

పెద : ఏం, యెందుకు సంపాదించుకోకూడదు?

సీత : ఊరుకోరా! ఆయన్తో యెందుకు-నువ్వు లోపలికిపో!

రమ : ఊఁ. పో! ఇక్కడనుంచి.

సీత : ఏమండీ, దేవుడిగుడి యెప్పుడు మొదలెడతారు?

రమ : అందరూ ఒకదారి కొచ్చినప్పుడు.

సీత : అన్నయ్యకి వదిననుకూడా తీసుకురమ్మని రాయక పోయూరా? తిరుపతి యెప్పుడూ చూడలేదండి వదిన పాపం!

రమ : ఇప్పుడు తిరుపతి యెవరెడుతున్నారూ?

సీత : అదేమిటండీ, మనమే! పోకపోతే ఎలా?

రమ : (చర్రుమని) ఇదుగో, మళ్ళీ చెబుతున్నా. ఈ కంఠంలో వూపిరి వుండగా తిరుపతిమాట ఎత్తడానికి వీలులేదు-తెలిసిందా!

సీత : ఎందుకండీ అంతమాట! అయ్యో లేస్తారేం!

రమ : సిగ్గులేకపోతే సరి! అంత మంచి దేవుళ్ళకు మొక్కబట్టే- కొడుకు యిట్లా తయారయ్యాడు. మొక్కులట మొక్కులు! (వెళ్తాడు)

సీత : అయ్యోరామ! నా కర్మ! ఇంత మొండిమేళంతో ఏం చేసేదిరా భగవంతుడా! (వెళుతుంది)

రవి అవీ ఇవీ సర్దుతుంటాడు.

పెద : 'కాదుసుమా! కల కాదుసుమా!'

రవి : రాగాలు తీద్దుకుగానిలెండి దొరగారూ! నాన్న యిక నీకు దమ్మిడీగూడా యివ్వడంటలే. అమ్మనుగూడ యివ్వద్దని చెబుతున్నాడు.

పెద : వాళ్ళిచ్చినా నాకక్కర్లేదు.

రవి : అబ్బో డాబుసరి! మరి నీ సిగరెట్లకీ సినిమాలకీ డబ్బులో ?

పెద : నాకేంరా, మంచి వుద్యోగం దొరికింది. నెలకి మూడువందలు !

రవి : మూడు వందల వుద్యోగమే! అన్నయ్యా !

పెద : ఊం. నాకేంరా, ఉద్యోగం కావాలండీ అని అలా అడిగేశాను- ఇలా వుద్యోగం ఇచ్చేశారు.

రవి : ఏం వుద్యోగంరా ?

పెద : మందుల ఏజన్సీ.

రవి : ఎబ్బె మందులమ్ముతావా ? ఛీ! నాన్నకి తెలిస్తే తంతాడు.

పెద : మందు లమ్మటమంటే '—మందులమ్మ మందులోయ్' అని బజార్లంట అరవట మనుకున్నావా ?

రవి : అరవకపోతే యెవరు కొంటారేంటి ?

పెద : అలాకాదోయ్. టిప్‌టాప్‌గా సూటువేస్తాను, హ్యాట్ పెడతాను. చేతిలో లెదర్ బ్యాగ్—బ్యాగ్‌లో మందుసీసాలు-దొరగారిలాగా ...

రవి : ఏం మందులురా అన్నయ్యా ?

పెద : మన మెడికల్‌స్టోర్స్ మాధవరావుగారు లేరూ, ఆయన కనిపెట్టాడు-బలే మందు !

రవి : దాని పేరేమిటి ?

పెద : సకలరోగ నివారిణి 'అభినవ చింతామణి'

రవి : 'చింతామణి' ఛీ,ఛీ! మొన్న నేనూ నాన్న 'చింతామణి' నాటకం చూశాం.

పెద : ఏడిశావ్ ! నాటకంలో చింతామణి కాదోయ్. చింతామణి అంటే...చాలా మంచిపేరులే ! ఇది యెన్నిరోగాలు నయం జేస్తుందో విను-చదువుతా ! సకలవిధములైన దగ్గులకూ, పడిశములకూ, కాళ్ళ నొప్పులకూ, కీళ్ళనొప్పులకూ, అజీర్తికీ, మలబద్ధకానికీ, మొటిమలకూ, స్త్రీల సమస్తవ్యాధులకు—

రవి : అబ్బ! బలేమందురా అన్నయ్యా ?

పెద : ఇవేకాదు-యింకా చాలా రోగాలు నయంజేస్తుంది.

రవి : ఎంతరా ?

పెద : మనం అమ్మేది సీసా రెండురూపాయలు. అందులో రూపాయిన్నర మనకి కమీషనే. రోజుకి అరడజన్ సీసా లమ్మితే చాలు - పదిరూపాయలు. నెలకి ముప్ఫయి పదులు మూడువందలు.

రవి : బలే... కాని రోజూ ఆరుసీసాలు ఎవరు కొంటారబ్బా!

పెద : ముందు ఒక నెల కష్టంరా ? తరువాత దీని మజా కనుక్కున్నారంటే 'మాకంటే మా' కని ఎగబడతారు. మనం కాలిమీద కాలేసుకుని కూర్చోవచ్చు

మందు సీసాలు అలా అమ్ముడు పోతూవుంటే—
మన డబ్బులు మనకి వస్తూవుంటయ్. పైగా యీ
జిల్లా మొత్తానికి మనమే యేజంట్లం!

రవి : బలే వుద్యోగంరా అన్నయ్యా! నన్ను యిక ప్రతి
సినిమాకి తీసుకెడతావా ?

పెద : ఓ! సినిమాలేం కగ్మం! కానీ తమ్ముడూ నువ్వో
సాయం చెయ్యాలిరా.

రవి : ఏమిటి ?

పెద : చిన్నపిల్లలు వెళితే ఆడవాళ్ళు ముద్దుకైనా కొంటారు.
కాబట్టి నువ్వు అమ్మ స్నేహితులందరి దగ్గిరకెళ్ళి
అమ్ముకురారా, నేను నాన్న స్నేహితులందరికీ
అమ్మోస్తా. ఏం ?

రవి : ఓ! తప్పకుండా, అయితే మీ యింట్లో యీమందు
వాడారా అని అడిగితే—

పెద : వాడారని చెప్పు—అరే శేఖరం, యెవరికిరా కాఫీ ?

శేఖ : అమ్మగారికయ్యా!

పెద : ఆ. ఆహాఁ. అక్కడపెట్టు! నేను తీసుకువెళ్ళి ఇస్తాలే.
నువ్వెళ్ళు.

శేఖ : తొందరగా యియ్యండిబాబూ! మళ్ళీ చల్లారిపోద్ది.

పెద : అలాగే-నువ్వెళ్ళు.

పెద : తమ్ముడూ ? అమ్మకి యీ మందు వాడిచూస్తే ?

రవి : అమ్మో! ఏం చేస్తుందో అది.

పెద : అరే దానిమీద రాసిలేదూ! 'సర్వరోగ నివారిణీ' అని. అంటే ఏ రోగం వున్నా పోగొడుతుందన్న మాట. అయినా మనకీ తెలుసుండటం మంచిది మందు సంగతి. కాఫీలో రెండుచుక్కలు వేస్తా!

రవి : అయితే యింకోచుక్క యెక్కువెయ్యి. తక్కువయితే మళ్ళీ పనిచేస్తుందో లేదో!

పెద : ...ఆc. చాల్లే, ఇక తీసుకెళ్ళీ కాఫీ అమ్మకిద్దాం రా! ...ఇదుగో మందు ఇచ్చినట్టు యెవరితోనూ చెప్పకు సుమా! చెప్పావంటే, సినిమాకు తీసుకెళ్ళను. జాగర్త! పోదాం రా!

## రెండవ రంగం

### తెల్లవారి - ఉదయం

రమ : (ఆదుర్దాగా) ఏమండీ డాక్టరుగారూ! ఏమిటి కంప్లైంటు?

డాక్ట : ఏమిటో గమ్మత్తుగా వుందండీ. Case pulse బాగానే వుంది. Lungs బాగానే వున్నయ్. పొట్ట మాత్రం వుబ్బి వుంది. ఎక్కిళ్ళు వస్తున్నయ్! అడిగితే సమాధానం చెప్పదు. ఏమిటో అగమ్యగోచరంగా వుంది. మధ్యాహ్నం యేమి తిన్నారు.

రమ : అబ్బే! భోజనంకూడా చెయ్యలేదండీ! ఒట్టి కాఫీ తాగి పడుకుంది.

డాక్ట: ఏమోనండి! నా కనుమానంగానే వుంది.

రమ : ఏమిటంటారు...

డాక్ట: ఏదో విషసంబంధమయింది లోపలికి పోకపోతే — ఆ పొట్ట వుబ్బరం వుండదు.

రమ : విషమా?

డాక్ట: అవును.

రమ : అదేమిటండి! దానికేం కర్మమండీ, విషం పుచ్చుకున్నదాకా?

డాక్ట: అదే నాకూ అర్థంకావడంలేదు. ఎందుకయినా మంచిదని ఇన్‌జక్షన్ యిచ్చానులెండి, దాంతో పొట్ట వుబ్బరం తగ్గవచ్చు—మళ్ళీ సాయంత్రం వచ్చి చూస్తానులెండి. ఈలోపల అవసరంవుంటే కబురు చెయ్యండి. సెలవు.

రమ : (నిట్టూర్చి) మనుష్యుల్ని మాడ్చుకుతింటానికి యీ డాక్టర్లొకళ్ళు! అన్ని అవయవాలూ బాగానే వున్నాయంటారు. మరి రోగమెందుకు వచ్చిందో చెప్పరు.

శేఖ : ఏమన్నారు బాబూ డాక్టరుగారు!

రమ : ఏమన్నారా, ఏడవమన్నారు. పోయి కాస్త కాఫీ తగలెయ్యి?

శేఖ : దేముడికి ముడుపు కట్టుకోండి బాబూ—

రమ : (కోపంగా) ఆఁ. దేవుడికేనా, నీకుకూడా యేమన్నా కావాలా ముడుపు?

పూజా: నమస్కారమండి రమణయ్యగారూ!

రమ : నమస్కారం ! దయచేయండి.

పూజా: సీతమ్మగారికి అకస్మాత్తుగా జబ్బుచేసిందట. ఏమిటి సంగతి ?

రమ : అదే అంతుతేలక యేడుస్తున్నాం.

పూజా: డాక్టరుగారు ఏమన్నారు ?

రమ : ఏమంటాడు? చచ్చేవరకూ 'ఫరవాలేదు-ఫరవాలేదు' అంటారు.

పూజా: అంతమాట ఎందుకండీ రమణయ్యగారూ ! యేం ఫరవాలేదు. ఆ యేడుకొండలవాడి కటాక్షం వుండాలిగాని ... ...

రమ : కటాక్షం తగలడ్డట్టే వుంది.

పూజా: సీతమ్మగారు దక్షిణపు గదిలో వరున్నారా ?

రమ : ఆc. వెళ్ళొచ్చు. వెళ్ళి చూచిరండి.

పూజా: చిత్తం !

రమ : ఈ పూజారి గాలికుక్కలనుగూడ మించాడే ! పొద్దు పొడిచేసరికి యెలా పసిగట్టాడోయ్.

శేఖ: నేనే వెళ్ళి పిలిచొచ్చా బాబు ! అమ్మగారే పిల్చుకు రమ్మన్నారు.

రమ : ఆc. అదాసంగతి ! అయితే మళ్ళీ వాడు యేదో రాద్ధాంతం చేస్తాడే.

శేఖ : మీా రెన్నన్నా చెప్పండి, అమ్మగారికి ఆ దిగులుతప్ప యేమీా రోగంలేదు బాబు.

రామ : ఏమిటోయ్ ఆ దిగులు.

శేఖ : తిరుపతి మొక్కులు తీర్చుకోలేదనే బాబూ !

రమ : సంతోషించాంలే – కట్టిపెట్టు !

శేఖ : అదేపనిగా కలవరిస్తున్నారు బాబూ, రాత్రంతా ! ప్రక్కన కూచుని యింటానేవుండా !

పూజా: సీతమ్మగారు చల్లనితల్లి ! మహా భక్తురాలు! ఎంత ఆదరణ ? ఎంత మర్యాద !

రమ : అదేమిటండీ. చచ్చినవాళ్ళనుగురించి మాట్లాడినట్టు మాట్లాడతారు.

పూజా: అబ్బే ! రామ ! రామ ! ఎంతమాట అనేశారు ? అంత జబ్బులోగూడ ఏడుకొండలవాడి స్మరణే ! నన్ను చూచి 'రండి కూర్చోండి' అని ఆదరించారు. పాపం ! ఏడుకొండలవాణ్ణి స్మరించుకుంటూ–కన్నీరు కార్చారు ! ఎంత భక్తి ! ఎంత భక్తి !

రమ : భక్తి! బండలు ! రోగ మొచ్చి అదేదుస్తుంటే...

శేఖ: ఆమెగారికేమి రోగము లేదుబాబూ ? ఆ దిగులుతప్ప.

పూజా: నిజం రమయ్యగారూ, తిరుపతి మొక్కులు తీరలేదే అని అదేపనిగా కన్నీరు పెట్టుకుంటున్నారు.

శేఖ : ఒకసారి తిరుపతి పోయొద్దాం బాబూ.

పూజా: తప్పదు రమణయ్యగారూ !

రమ : మతేమయినా పోయిందా మీకు ?

శేఖ : అమ్మగారి అవస్థ చూడలేం బాబూ !

రమ : నోరుముయ్ ! ఆ మాట యెత్తడానికి వీల్లేదు.

సీత : (దూరంగా మూల్గుతూ) మీకేంటెండి! చస్తే నేనే చస్తా. మీరు సుఖంగా వుందురుగాని!

రమ : (ఆశ్చర్యంగా) ఆఁ. లేచివచ్చావేమే! డాక్టర్లు కదలొద్దని చెపితే!

శేఖ : అమ్మా! అమ్మా!

పూజా ఆఁ. జాగర్త! పడిపోతున్నారు, పట్టుకోండి రమణయ్యగారూ!

సీత మూల్గుతుంటుంది

రమ : అయ్యో రామా! నువ్వెళ్ళి పండుకోవే! మా ప్రాణాలమీద కెందుకు తెస్తావ్?

సీత : (మూల్గుతూ) మీ కెందుకులెండి శ్రమ! నేనే వెళ్ళిపోతా! ఏడుకొండలవాడా! వెంకటరమణా!

పూజా: సీతమ్మగారూ! దిగులు పడకండి! నయం కాగానే రమణయ్యగారు తిరుపతి తీసుకెళతారుగా!

సీత : (ఆశతో) ఆఁ. నిజంగానా?

శేఖ : నిజం అమ్మా.

పూజా: నిజంగానమ్మా!

రమ : ఆఁ!

శేఖ, పూజా : చూశారు బాబూ! ఆ మాట చెవినిబడగానే కళ్ళలో ఎంత కాంతి వచ్చిందో!

సీత : నిజంగానా! నిజంగానా!

శేఖ : బాబూ! మీ నోటిమీదుగా అనండి! వారి రోగ
మంతా ఎగిరిపోద్ది.

పూజా: అనండి రమణయ్యగారూ.

రమ : (సందేహిస్తూ) ఆఁ.

సీత : ఏమండీ! నిజంగానా! తిరపతి వెళదామా?

శేఖ : ఊఁ అనండి బాబూ!

పూజా: అనండి రమణయ్యగారూ!

సీత : ఏమండీ?

శేఖ, పూజా : ఊఁ అనండి బాబూ.

రమ : అలాగే వెళదాంలే! నువ్వెళ్ళి స్థిమితంగా పడుకోవే.

సీత : (సంతోషంతో) నిజంగానా! తిరుపతి వెళదామా!
ఎప్పుడు? ఎప్పుడు?

రమ : నయం కాగానే వెళదాంలే! నువ్వు పండుకో.

సీత : అమ్మయ్య! అమ్మయ్య! (నిట్టూర్పు)

శేఖ, పూజా : పండుకోండమ్మా! ఆ వేదన పడకండి.

సీత : అమ్మయ్య!

పూజా: చూశారా రమణయ్యగారూ! ఆ మాటతో ఆమె
జబ్బంతా పోయింది.

శేఖ : ఇన్నాళ్ళనుంచీ కాదన్నారు, సమయానికి మనసు
మార్చుకున్నారు. మా బాబుగారు అమ్మగార్ని
బ్రతికించారు.

రమ : (నిట్టూర్చి) నాకేం అర్థం కావటంలా!

## కొద్దిరోజుల తర్వాత-ఒక శనివారం సాయంత్రం

సీత : శేఖరం - అన్నీ సర్దినట్టేనా ?

శేఖ : అన్నీ సర్దానమ్మా? ఇంక అయ్యగారి బట్టలు మట్టుకు సర్దాలి; అంతే.

సీత : అవి అయ్యగారు వచ్చాక అడిగి సర్దుదువుగానిలే. నీ వంట సామాగ్రిఅంతా జాగ్రత్తగా చూచుకో. అదుగో, అయ్యగారు రానేవస్తున్నారు.

రమ : ఏమిటీ హడావుడి అంతా ! మూటా ముల్లీ సర్దు తున్నారు, ఎక్కడికి ప్రయాణం ?

సీత : తిరుపతికండి.

రమ : తిరుపతి ?... మళ్ళీ మొదలెట్టావ్ ?

సీత : అదికాదండి ! మధ్యాహ్నం భోంచేసి పడుకుంటే— వెంకటేశ్వరస్వామివారు కలలో కనిపించారండి. అందుకని-రేపు ఆదివారమేకదా అని ప్రయాణ సన్నాహం చేశాను.

రమ : నిన్నగాక మొన్న అంత జబ్బుపడి...

సీత : పరవాలేదులెద్దురూ - మళ్ళీ రేపు సాయంత్రానికి తిరిగి రానే వస్తుంటిమి.

రమ : ఈ రోజుల్లో రైళ్ళు యెంత తొందరగా...

సీత : అందుకనే మహాలక్ష్మమ్మగారి పెనిమిటికి నేను కబురు చేశాను, కారు కావాలని. మీరు అడగమన్నారని కబురు చేశాను! పాపం ఆయన వెంటనే పంపించారు గూడా.

రవి : నేనే అడిగొచ్చాను నాన్నా!

రమ : ఇదొకటా పైగా! మాట అనుకుంటే జరిగితీరాలి సిందే నన్నమాట. మొత్తంమీద సుబ్బారాయుడి గారి కూతుర్ని నిపించావ్!

సీత : అబ్బ దెప్పారు లెద్దురు! తిరుపతి వెడదామని మీరే అన్నారు కాబట్టి ప్రయాణమయ్యాను. లేకపోతే...

రమ : అవసరంకొద్దీ మాట అన్నానే అనుకో—నీకు ఆ విశ్వాసం వుందీ—మందులకు లొంగని రోగాన్ని ఒక మాటతో పోగొట్టానే—చావుకు సిద్ధంగా వున్న నిన్ను తేలిగ్గా బతికించానే—

సీత : మరి అన్నమాట నిలబెట్టు కుంటేగా...

రవి : అబ్బా! నాన్న బలే గప్పాలు కొడుతున్నారే. అమ్మ రోగం నయమయింది మా మందు మూలాన గదూ!

రమ : ఏం మందురా?

గుమాస్తా ప్రవేశం

గుమా: అయ్యా రమణయ్యగారూ! ప్రసాదరావుగారు పంపించారండి. మీతో అర్జంటుగా మాట్లాడాలట. మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారు.

రమ : ఏమిటబ్బా అంత అర్జంటు పని? నీతో యేమన్నా చెప్పారా?

గుమా: నిన్న మీ పెద్దబ్బాయిగారు యేదో మందుసీసా అమ్మివెళ్ళారు. చినబాబుగారు ఆ సీసా తీసుకెళ్ళి

ఆడుకుంటూ క్రిందపడేసి పగలగొట్టారు, మందు కింద పడింది. వెంటనే మా అయ్యగారి కుక్క వచ్చి నాకిందండి, ఇంకేముంది గంటసేపట్లో ఢాంఅని చచ్చింది. మా అయ్యాగారు కళ్ళనీళ్ళు కూడా పెట్టుకున్నారు బాబు. ఆ కుక్క అంటే మా అయ్యగారికి ప్రాణం.

రమ : అసలు——మావాడు మందు లమ్మటమేమిటోయ్.

గుమా: అమ్మారు బాబూ ? నేనే డబ్బిచ్చింది కూడాను!

రమ : ఒరేయ్ ! పెదబాబూ !

పెద : (లోపలునుంచి) ఆఁ.

రమ : ఇలారా !........ప్రసాదరావుగారికి మందునీసా అమ్మావా ?

పెద : అవును.

రమ : నువ్వు మందు లమ్మటమేమిటి ? ఏ మందు ?

పెద : నేను మందుల ఏజన్సీ తీసుకున్నాను.

రమ : ఒరి భ్రష్టుడా! యీ కుక్కల్ని చంపే మందులా దొరికాయి నీకు ?

పెద : అహాఁ. చాలా మంచిమందు నాన్నా అది.

రమ : (కోపంగా) నీ బొందమందు. అదిగో విను - ప్రసాద రావుగారి కుక్క అమాంతంగా చచ్చిందట.

పెద : మనుష్యులికివేసే మందు కుక్కకేస్తే చావకేంజేస్తుంది.

రమ : ఊఁ. ఇక మనుషులి ప్రాణాలుకూడా తీద్దువుగాని !

పెద : అమ్మాకీచూడు యెంత తొందరగా పనిచేసిందో !

రమ : అమ్మాకి పనిచెయ్యటమేమిటి నీ మొహం !

పెద : మొన్న అమ్మాకి సుస్తీగా వుంటే—ఆ మందే యిచ్చాను కాఫీలో వేసి.

రవి : అన్నయ్య రెండు చుక్కలేస్తానంటేనూ, నేనే యింకా రెండు చుక్కలు యెక్కువ వేయించాను నాన్నా!

రమ : ఏమే !

సీత : ఏమోనండి ! నాకేం తెలుసు.

పెద : వీళ్ళా కెవ్వరికీ తెలియకుండా— కాఫీలో నాలుగు చుక్కలు వేశాము.

రమ : ఓరి దౌర్భాగ్యుల్లారా ! అమాంతంగా ప్రాణం తీసేవారే ! యిక వీళ్ళ నేం జేస్తే...

సీత : ఊరుకుందురూ — చిన్నతనం. అయినా రోగం నయమైందిగా !

రమ : ఇంకా నెత్తి నెక్కించుకో. అసలు నువ్వే పాడు చేస్తున్నావ్ వీళ్ళని !

సీత : యీ గొడవల్లో ప్రయాణం ఎగరగొడదా మనుకుంటున్నారేమో ! తప్పక వెళ్ళాలిసిందే—

రమ : ఊఁ కానియ్ ! ఈ కొంపలో నామాట ఏం సాగుతోంది గనక— ఈ నరకం కంటే ఏ అడివయినా నయమే—ఊఁ, పదండి.

సీత : (సంతోషంతో) అలాగే శేఖరం, సామాన్లన్నీ కారులో పెట్టు.

శేఖ : అన్నీ పెట్టానమ్మా. అయ్యగారి బట్టలు...

రమ : ఏవో నాలుగు తగిలెయ్... ఒరేయ్ పెదబాబూ! నువ్వు ఏమాత్రం బాధపడటానికి వీల్లేదు. వచ్చినట్టు యింటిదగ్గర పడివుండు.

సీత : ఉండునాయనా! యింటిదగ్గర లేవుండు. నే నొచ్చాక డబ్బులిస్తాగా !—

పెద : నే నసలు రమ్మన్నా రాను. రేపు ఆదివారంగూడా! హాయిగా ఖాళీగా వుండుకోసా లమ్ముకుంటా.

రమ : (బయట్నుంచి) ఊఁ. కావే తొందరగా— డ్రైవర్! కారు స్టార్ట్ చెయ్యి.

కారు స్టార్ట్ అయిన ధ్వని.

పెద : 'గృహమేకదా స్వర్గసీమ'

